సంపుటి 8,
సంచిక 21.

నవంబర్ 13,
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



# నవప్రపంచాన్ని నిర్మించిన నలభైఏళ్ళు

డి. జెస్లావ్‌స్కీ
పత్రికా రచయిత

అమెరికన్ పత్రికా రచయిత జాన్ రీడ్ 1917 లో జరిగిన మహత్తర ఘటనలనుచూసి, "ప్రపంచాన్ని కదిల్చిన పది మహత్తరదినాలు" అన్న గ్రంథాన్ని వ్రాశారు.

ప్రపంచం మూలమట్టంగా కదిలిపోయింది. కాని యీ మహత్తర దినాల ప్రాముఖ్యం ప్రపంచాన్ని కదిల్చివేసే వాటి శక్తిలో మాత్రమే కాదు, నవ ప్రపంచ నిర్మాణానికి పునాదులను వేయడంలో కూడా వుంది.

మన సమకాలీనులలో చాలా కొద్దిమంది మాత్రమే దీనిని ముందుగా గ్రహించారు. లెనిన్ శిష్యులూ, సహచరులూ అయిన కమ్యూనిస్టులున్నారు, వీరిలో. సామ్యవాద విప్లవం కేవలం తాత్కాలికమైన ఆఘాతము మాత్రమే కాదనీ, దోపిడీమీద ఆధారపడిన సమాజంయొక్క సంపూర్ణ వినాశనంతో అంత మవ్వక తప్పని ఒక నూతన చారిత్రిక దశకు ప్రారంభమనీ వారు అర్థం చేసుకున్నారు. ప్రపంచ చరిత్రను శాస్త్రీయంగా పరిశీలించి, దీనిని మార్క్స్ జోస్యం చెప్పారు. ఆయన మహత్తర కృషిని కొనసాగిస్తూ లెనిన్ సామ్యవాద విప్లవసిద్ధాంతాన్నీ, వ్యూహాన్నీ విపులీకరించి పెంపొందించారు.

ఈ శాస్త్రీయమైన జోస్యం సరియైనదిగా నిరూపితమైంది.

అభివృద్ధినిరోధక విజ్ఞానశాస్త్రజ్ఞులు, రాజకీయవేత్తలు అంధులు, బధిరులు. రష్యాలో జరిగిన కంపం పుట్టించే ఘటనలను వారు గుర్తించారు, కాని ఏమీ అర్థం చేసుకోలేదు. రష్యాలో జరిగిన సాంఘిక విప్లవానికి వారు అట్టే ప్రాముఖ్యం యివ్వలేదు. తొందర్లోనే అంతరించిపోయే ఒక అసహ్య ఘటనగా దానిని వారు పరిగణించారు. వారి దృష్టిలో పాత ప్రపంచం కూలిపోవడానికి వీలు కాసంత దృఢంగా వుంది.

నేడున్న అనుకూల పరిస్థితులనూ చూస్తే, ఆ ప్రపంచం చాలా వింతగా వుంటుంది. అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి, జర్మన్ పెట్టుబడిదారులు ప్రపంచాన్ని పరిపాలిస్తూ వుండేవారు. యూరప్ విశిష్టమైన ఖండం. ప్రభుత్వంమీద, సంస్కృతిమీద గుత్త పెత్తనం దానిదే. 1917 లోనే కాకుండా, దానికి చాలా తరవాతనుకూడా, ద్వితీయ ప్రపంచ యుద్ధంవరకూ కూడా, సుమారు ఒకటిన్నర మిలియర్డ్ల ప్రజలు, లేదా ప్రపంచ జనాభాలోని రెండు మిలియర్డ్లకు పైగా ప్రజలలో నూటికి 66 వంతులు సామ్రాజ్యవాదులపైని ఆధారపడిన వలస ప్రజలు. చర్చి, బూర్జువా విజ్ఞానం పెట్టుబడిదారీ విధానాన్ని ఒక శాశ్వతమైన, ఆదర్శవంతమైన, దివ్య వ్యవస్థగా ప్రకటించాయి.

రష్యన్ జారుల సామ్రాజ్యం కూలిపోయినప్పుడు, బూర్జువా వర్గం ఎక్కువగా బాధ పడలేదు. తరవాత తొందర్లో జర్మన్ సామ్రాజ్యమూ, దాని వెనుక ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యమూ, దాని వెంబడిని చాలామంది చిన్నచిన్న రాజులూ కూలిపోయినప్పుడు వారు స్థైర్యాన్ని కోలుపోలేదు. రాచరికాలు అదృశ్యమవుతూ వున్నాయి. కాని పెట్టుబడిదారీ విధానం రష్యాలో తప్పితే ప్రతిచోటా వుండిపోయింది.

ఇంతగా గుడ్డితనం లేకపోయి వున్నట్టయితే, బూర్జువా తత్వశాస్త్రజ్ఞులు సామ్యవాద విప్లవ ప్రారంభంలోనే కొన్ని విషయాలను దర్శించి వుండేవారు; అది వారిని మేలుకొలిపి విషయాలను గ్రహించేటట్టు చేసి వుండేది.

సామ్యవాద విప్లవంపట్ల కార్మికవర్గమూ, కష్టజీవులందరూ చూపిన మహత్తర అంతర్జాతీయ సానుభూతి, మొదటి విషయం.

రెండవది, వలసదేశాల ప్రజల మహత్తర సానుభూతి. సామ్రాజ్యవాదం నుండి రష్యా ప్రజల విముక్తిలో, తాము ఏళ్ల తరబడిగా సాగిస్తోన్న తమ జాతీయ విముక్తి పోరాటాన్ని దర్శించారు పీడిత ప్రజలు; దానిని తమ ప్రతిజ్ఞగా వారు భావించారు.

ఈ రెండు విషయాలూ సామ్యవాద విప్లవ అంతర్జాతీయ స్వభావాన్ని చాటి చెబుతాయి. కాలమూ, స్థలమూ పరిమితమై వున్న ఒక స్థానిక సంఘటన కాదది. అది కేవలమూ విధ్వంసకారి కాదు. నలభై ఏళ్ళ క్రితం మొదలై నేటికీ కొనసాగుతోన్న ఒక ప్రపంచ చారిత్రిక క్రమం అది అప్పుడూ, యిప్పుడూ.

ఈ క్రమంలోని విషయం, ప్రథమంగా యిరవై కోట్ల జనాభా గల ఒక దేశంలో సామ్యవాద విజయం, తరవాత తొంభై కోట్లకు పైగా జనాభాగల — అంటే ప్రపంచ జనాభాలో ఒకటింట మూడో వంతుకు పైగా జనాభాగల చాలా దేశాలలో సామ్యవాద విజయం.

(మిగత 8 వ పుటలో)





"...నూతన సోషలిస్టు సమాజపు ప్రజలయొక్క విముక్తమైన చైతన్యవంత కృషి మానవాళి యొక్క సాహసవంతమైన కలలను యెలా నిజం చేయగలదో మన సమకాలికులు స్పష్టంగా తెలుసుకొని తీరుతారు."

(ఒక టాస్ ప్రకటన నుండి)


ఇ. ర్యాబ్‌చికోవ్


ర్తాపత్రికలు, రేడియో కేంద్రాలు ఒక మహత్తర సంఘటనను—సోవియట్ దేశం భూమియొక్క మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహాన్ని యెగురవేయడాన్ని—ప్రకటించాయి.

వేలకొలది బైనాక్యులర్లు ఆకాశం వైపు తిరిగాయి. రాడార్, ఆప్టికల్ ట్రాక్టర్లు నీలి ఆకాశం అంతటా పరిశీలించసాగాయి. సూర్యోదయం ఇంకా అవుతుందనగా, ఉషఃసమయంలో, అత్యంత వేగంతో పయనిస్తున్న ఆ నక్షత్రాన్ని చూడడానికి లక్షలకొలది కళ్ళు ప్రయత్నం చేస్తుంటాయి. వాషింగ్‌టన్, లండన్, ప్యారిస్, కలకత్తా, పెకింగ్, ప్రాగ్‌లలో కనబడింది. డిట్రియెట్ మోటారు యంత్రాగారంపైన, వింతల దేశం బగ్దాద్‌పైన మెరిసింది.

"అదుగదుగో! ఉపగ్రహం!" అన్న మాటలు ప్రపంచమంతటా, అన్ని దేశాల్లోను వినబడుతున్నాయి. "మేము చూశాము! మేము విన్నాము!"

ఆకాశంలోంచి "చిన్నారి చందమామ" పంపుతున్న సంజ్ఞలను వినడానికి వేలకొలది జనం తమ రేడియోసెట్లముందు కూడారు. అంతరిక్షంలో యెగురుతున్న యీ "పరిశోధనాలయం" పంపిన స్పష్టమైన శబ్దాలను అనేక కిలోమీటర్ల అయస్కాంతపు టేపు రికార్డు చేసింది.

సోవియట్ ప్రజలు తయారుచేసిన యీ ఉపగ్రహం మనకు వింతగా ఉండే అంతరిక్షంలో యెగరడంతో మాత్రమే సరిపుచ్చడం లేదు. భూమి కేవలం ఒక గోళంగా కనబడుతూ, భూమ్యాకర్షణ శక్తి ప్రభావం యేమాత్రమూ ఉండని ఆ వింతనుగొల్పే అంతరిక్షంలో కృత్రిమ ఉపగ్రహం పనిచేస్తూ తాను తెలిసికొన్న విషయాలను, చూచిన విషయాలను మనకు చెబుతున్నది.

ప్రాచీన, ఆధునిక ఖగోళశాస్త్రవేత్తలు, విజ్ఞానశాస్త్రవేత్తలు కంటూవచ్చిన కలలు, ఊహాకల్పనలుచేసి వ్రాతలువ్రాసిన రచయితల ఆశలు, అంతరిక్షయానానికి విజ్ఞానశాస్త్రవేత్తలు చేస్తున్న కృషి—అన్నీ వాస్తవవిషయాలయ్యాయి.

కృత్రిమ ఉపగ్రహం మాకు కేవలం ఒక లోహపు బంతి, ట్రాన్స్‌మిటర్లు, "రికార్డింగ్ యంత్రాలు"గల ఒక వైజ్ఞానిక పరికరం, "అంతరిక్షంలో యెగిరే పరిశోధనాలయం మాత్రమేగాదు. మాకు



ఎగురవేయబడడానికి పూర్వం, నాలుగు ఏరియల్స్‌తో వున్న భూ-ఉపగ్రహపు ఛాయాచిత్రం

కృత్రిమ ఉపగ్రహమంటే చిక్కు సమస్యల పరిష్కారం, కొత్త విషయాలు కనిపెట్టడం యొక్క సుదీర్ఘమైన గాథ, వివేకంపై దౌష్ట్యం, దౌర్జన్యాలకు ఉంటూవచ్చిన విచారకరపు పట్టుయొక్క, స్వేచ్ఛా ప్రపంచంలో మేధస్సు విజయం యొక్క కథ.

నలభై సంవత్సరాల క్రితం, అరోరా యుద్ధనౌక పేల్చిన ఫిరంగి ధ్వని, ఒక నూతన ప్రపంచపు పుట్టుకను, వివిధ ప్రజల మధ్య నూతన సంబంధాల, విషయాన్ని, మానవ మేధస్సుయొక్క విముక్తిని అన్ని దేశాలకు, ప్రపంచ ప్రజలందరికి ప్రకటించింది. ప్రఖ్యాతిగాంచిన యుద్ధనౌక అరోరా ఆ విధంగా ఫిరంగిని పేల్చడానికి ముందు, దారిద్ర్యంతో బాధపడుతున్న అనాగరపు రష్యా బురదమయమైన తనరోడ్లవెంట తూలుతూ నడుస్తుండేది. దౌర్భాగ్యపు స్థితిలో ఉన్న లక్షలాది రైతులు గుడిసెల్లో తలదాచుకొంటుండేవారు. కిరసనాయిలు దీపం ఉండడమంటే ఎంతో గొప్ప విశేషం. గ్రామస్థులంతా రాత్రిళ్ళు నెగళ్ళ వెలుగుతోనే కాలం వెళ్ళబుచ్చుతుండేవారు. కోడికూతే వారికి కాలాన్ని తెలియజేసే గడియారం. గ్రామాల్లోను, నగరాల్లోను చదువువచ్చినవారి సంఖ్య అతి స్వల్పంగా ఉండేది. అధిక సంఖ్యాకులు నిశానిదార్లే. ప్రజలు గుడిసెల్లో జీవిస్తూ, ఇనుపముక్కనే ఒక అపురూపమైన వస్తువుగా పరిగణిస్తూ ఉండిన స్థితిలో, రష్యన్ విజ్ఞానశాస్త్రవేత్త కె. త్సియోల్కొవిస్కీ యొక్క సాహసవంతమైన కలలు, గత శతాబ్దంలో ఆయన కనిన కలలు, సౌభాగ్యవంతులైన పరిపాలకులకు వింతగా, అర్థరహితంగా ఉంటూవచ్చాయంటే, రాకెట్లు, భూమి, చంద్రుడు, సూర్యుని కృత్రిమ ఉపగ్రహాల విషయం అసంగతంగాను కనబడ్డాయంటే ఆశ్చర్యపడవలసిన విషయమేముంది ?

వెనుకబాటుతనంలో ఉన్న దేశానికీ, బాగా అభివృద్ధి పొందియున్న పెట్టుబడిదారి దేశాలకు మధ్యగల తేడాను అధిగమించడానికీ, విద్యాభ్యాసాన్ని అధికం చేయడానికీ, ఉన్నత గణితశాస్త్రంలో ప్రాజ్ఞతను పొందడానికీ, బ్లాస్ట్ ఫర్నేస్‌లూ, విద్యుత్ కేంద్రాలునిర్మించడానికీ, రోడ్లను వెయ్యడానికీ, జలపాతాలను అదుపులోపెట్టడానికీ, వైజ్ఞానిక పరిశోధనాలయాలను స్థాపించడానికీ, ఓపెన్ హార్త్ ఫర్నేస్‌లను కట్టడానికీ, వైజ్ఞానిక, సాంకేతిక బృందాన్ని తయారుచేసుకోడానికి ఆ నూతన మానవుడు చారిత్రకంగా అతి స్వల్పమైన

ఉపగ్రహంయొక్క ఉపగ్రహం
("సోవియట్‌స్కయా రాస్సియా"లోని వ్యంగ్య చిత్రం)





ఉపగ్రహపు కక్ష్య

కాలవ్యవధిలో ఎంతగా కృషిచేయవలసివచ్చిందో ఒకసారి ఆలోచించండి !

కలలుగనడం కళకు విలువనిచ్చి, దానిని ప్రేమించి, ప్రజలనందరినీ కలలుగనమని ఉత్సాహంతో కోరిన ఒక వ్యక్తి రష్యాలో ఉండేవారు. ఆయనే లెనిన్ ! కలలుకనడం మానవునిలోని ఒక విశిష్ట గుణమని ఆయన అభిప్రాయపడ్డారు.

ఆ రోజుల్లో యీ దిగువ సంఘటన జరిగింది: ప్రఖ్యాత ఇంగ్లీషు రచయిత హెచ్. జి. వెల్స్, ఆకురాలుకాలంలో ఒకనాడు, కరువు ఉధృతంగా ఉన్న నగరవీధుల్లోంచి క్రెమ్లిన్‌కు వెళుతున్నారు. లెనిన్‌ను చూడడానికే ఆయన వెళుతున్నారు. దేశాన్ని విద్యుద్దీకరణం చేయడాన్ని గురించి, గ్రామాలను పునర్నిర్మించడాన్ని గురించీ లెనిన్ వెల్లడించిన భావాలు వెల్స్‌కు అర్థంకాలేదు. అజ్ఞానంలోను, వెనుకబాటుతనంలోను ఉన్న రష్యాలాంటి దేశాన్ని విద్యుద్దీకరణ చేయడం అసాధ్యమనీ, లెనిన్ కలలు ఎన్నటికీ నిజాలు కాజాలవనీ వెల్స్ అభిప్రాయపడ్డారు.

ఆయన చెబుతున్నదంతా లెనిన్ చిరునవ్వుతో విన్నారు. కుర్చీలో ముందుకూ, వెనుకకూ ఊగుతూ లెనిన్ భవిష్యత్ రష్యా ఎలా ఉండబోతున్నదో, ఆశ్చర్యపోతున్న తన అతిథికి చక్కగా వివరించి చెప్పారు. సమాజాన్ని మార్చివేయడానికి వేయబడిన బృహత్ పథకాలను గురించి తెలియజేశారు. వెల్స్ వాటిని నమ్మలేక తల వంకిస్తూ, భుజాలు ఎగురవేసి, కలవరం చెందిన మనస్సుతో హోటల్‌కు తిరిగి వెళ్ళిపోయారు. హెచ్. జి. వెల్స్ వ్రాసిన "అంధకారంలో రష్యా" అన్న గ్రంథం, తన సాహిత్య పాత్రలను సాహసవంతంగా చంద్రలోకానికి పంపిన ఆ రచయిత, తన ఊహాప్రపంచంలో కాలయంత్రాన్ని సృష్టించిన ఆ రచయిత, లెనిన్ మాటలను విశ్వసించలేకపోయారని స్పష్టంచేస్తుంది.

కాని కాలయంత్రం తన పనిని నెరవేర్చింది.

ఈ మధ్య లండన్‌లోను, న్యూయార్క్‌లోను ప్రదర్శింపబడిన "టి.యు.-104" జెట్ ప్రయాణీకుల విమానం ఇంగ్లీషువారినీ, అమెరికన్లను ఆశ్చర్యపరిచింది. ఈ "అంతరిక్షపు బాణము" ఇంకా సముద్రందాటి వస్తుండగానే మరొక వింతవిషయాన్ని గురించి అమెరికాలోను, ఇంగ్లండులోను చర్చ జరుగసాగింది. సోవియట్ దేశం ప్రపంచంలోని మొట్టమొదటి ఖండాంతరగామి బాలిస్టిక్

(మిగత 8వ పుటలో)

*అక్టోబరు 4వ తేదిన మానవాళి చరిత్రలో మొట్టమొదటిసారిగా భూమి యొక్క కృత్రిమ ఉపగ్రహం సోవియట్ దేశం చేత ఆకాశంలోకి ఎగురవేయబడింది. ఈ సందర్భంలో మేము సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు కరస్పాండింగ్ సభ్యుడు ఇ. ప్యాదొరోవ్‌తో జరిపిన ఇంటర్వ్యూను ప్రకటిస్తున్నాము.*

సోవియట్‌దేశ భూభాగంనుండి అంతరిక్షంలోకి పంపబడిన భూమియొక్క కృత్రిమ ఉపగ్రహం మా విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగుల మహత్తర విజయాలకేగాక, సోవియట్ సోషలిస్టు పరిశ్రమల శక్తికిగూడా గట్టి నిదర్శనం.

వాతావరణం పైపొరలు, మానవునికి తెలిసిన వాతావరణం పొరకూ, కాస్మిక్ ప్రాంతానికీ మధ్యగల సరిహద్దు మండలానికి సంబంధించిన అనేక క్లిష్ట సమస్యలను పరిష్కరించడానికి విజ్ఞానశాస్త్రవేత్తలకు కృత్రిమ ఉపగ్రహం సహాయపడుతుంది.

వాతావరణ పైపొరలు భూమండలమీది ప్రాణికోటికి చాలా ప్రాముఖ్యతను కలిగివున్నాయి. కొన్నిరకాల సౌరప్రసారాల ప్రమాదకర ప్రభావంనుండి, కాస్మిక్ కిరణాలు, అంతరిక్షంలోంచి భూమండల వాతావరణంలోకి నిరంతరం ధారావాహికంగా వచ్చే రెండు ఉల్కాపాతాలనుంచి భూమండలం మీది ప్రాణికోటిని రక్షించడానికి ఈ పొరలు నమ్మకమైన అడ్డు తెరగా వుంటున్నాయి.

వాతావరణపు పైపొరలు సుమారు 800-1,000 కిలోమీటర్ల ఎత్తువరకు వ్యాపించి వున్నాయి. 100 కిలోమీటర్ల ఎత్తుకు వెళ్ళేటప్పటికే వాయువుయొక్క సాంద్రత మిలియన్‌లో ఒకవంతుకు పడిపోతుంది; 500 కిలోమీటర్ల ఎత్తుకు వెళ్ళేటప్పటికి మిలియన్ మిలియన్లలో ఒకవంతుకు పడిపోతుంది. అయినప్పటికీ, అతిస్వల్ప పరిమాణంలోనూ, పల్చగానువున్న ఈ వాయువులు ఆ ఎత్తున అత్యంత ముఖ్యమైన ప్రాణరక్షణ ప్రక్రియను జరుపుతూ వుంటవి. వాతావరణం పైపొరలలో అతిక్లిష్టమైన పదార్థ-రసాయనిక ప్రక్రియలు కొనసాగుతూ, సౌర కిరణాలు, కాస్మిక్ కిరణాలు, అతిచిన్న అణువులు, భూతలానికి చేరుకొనేలోగా ప్రాణికోటికి ప్రమాదరహితంగా వుండేట్లు మార్చివేయ బడుతుంటాయి.

కాని, వాతావరణపు పైపొరల పాత్ర ఇంతటికే పరిమితమై వుండడం లేదు. వాతావరణం క్రిందిపొరలైన ట్రొపోస్ఫియర్‌లో కొనసాగుతున్న ప్రక్రియలపై ఒకవిధమైన సౌర అంశపు ప్రభావాన్ని గూడా కలుగజేస్తాయి. సౌర ప్రక్రియలోని మార్పులు, వాతావరణం దిగువ పొరలపైన, వాయుగుండాలు, ప్రతివాయుగుండాలపైన, సముద్రపు నీటి ఆటు, పోటులపైన ప్రభావాన్ని కలుగజేస్తూ, మన గ్రహం యొక్క పదార్థత్వంలో కొన్ని అంశాలకు కారణభూతమవుతున్నాయి.

వాతావరణం సరిహద్దులో ఉద్భవించి, పెంపొందే విద్యుదయస్కాంత ప్రక్రియలు, అయస్కాంతపు తుఫానులను, ఉత్తర ధృవారుణ జ్యోతులను కల్పిస్తుంటాయి. ఈ అంశాల పరిశోధన గొప్ప ప్రాముఖ్యతను కలిగి వుంటుంది. అంతరిక్ష ప్రయాణాలకు సంబంధించిన సమస్యల పరిష్కారానికి యిది ముఖ్యంగా తోడ్పడుతుంది. భవిష్యత్తులో అంతర్గ్రహ మిసైల్‌లను, అంతరిక్ష విమానాలను డిజైను చేసేప్పుడు ఉల్కాపాత ప్రవాహాలను గురించీ, ప్రాథమిక కాస్మిక్ కిరణప్రసారం, వాతావరణపు పైపొరలయొక్క తదితర అంశాలను గురించీ విస్మరించడానికి వీలులేదు.

రాకెట్ యానపు ప్రత్యేక పరిస్థితుల్లో ప్రాణికోటి యేవిధంగా ప్రవర్తిస్తుందన్న విషయంలో సోవియట్ జీవ శాస్త్రజ్ఞులు అత్యంత ఆసక్తిదాయకమైన పరిశోధనలను చేశారు. రాకెట్‌యాన పరిస్థితుల్లో జంతువులపై కలిగే ప్రభావాన్ని గురించీ, చాలా ఎత్తునుండి పారచూట్లతో క్రిందికి దిగేప్పుడు రక్షణ పద్ధతులను గురించీ పరిశోధనలు జరుపబడ్డాయి.

రేడియో కేంద్రపు ఇంజనీర్ల సహాయంతో తప్ప పరిష్కరింపబడజాలని అనుకోని సమస్యలు ఉపగ్రహ పరిశోధనల సమయంలో యెన్నెన్నో యెదురవుతుంటాయి. రేడియోకేంద్రపు చీఫ్ ఇంజనీర్ నికొలాయ్ అస్లమెజోవ్(మధ్య) రేడియో ఇంజనీర్లతో జరుపుతున్న అలాంటి ఒక సమావేశ దృశ్యం
—ఛాయా చిత్రకారుడు: వై. చెర్లినర్



అమెరికాలో గూడా యిలాంటి పరిశోధనలు జరిగాయి: ఎలుకలు, కోతులు రాకెట్‌లో పైకి పంపబడ్డాయి. అలా పంపబడిన కోతుల పైన బాధా నిరోధక ఔషధము ప్రయోగింపబడింది. దీని మూలంగా, రాకెట్ యాన పరిస్థితులు జీవులపైన ఎలాంటి భావాన్ని కలుగజేస్తాయన్న విషయాన్ని సక్రమంగా తెలుసుకొనడం అసాధ్యమన్నది స్పష్టం.

సోవియట్ పరిశోధకులు, శారీరక నిర్మాణ రీత్యా ఉన్నతస్థాయికి చెందిన జీవులు కుక్కలను యీ పనికి ఎన్నుకొన్నారు. ఈ ప్రయోగానికి ముందు కుక్కలకు ప్రత్యేకమైన శిక్షణ యివ్వబడింది.

వాతావరణపు పైపొరలలో కొద్ది కాలం పాటు—దాదాపు ఒక గంటపాటు—ప్రయాణం గావించినమీదట ఈ కుక్కలను పరిశీలించగా, వాటికి యేలాంటి హాని కలుగలేదని వెల్లడయింది. అందువల్ల, వాతావరణపు పైపొరలలో మానవుడు రాకెట్‌లో ప్రయాణం చేయడం సాధ్యంకావచ్చునని భావింపవచ్చును.

కృత్రిమ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి పంపడం, రాకెట్లను పంపడంకంటే చాలా క్లిష్టమైన పని.

మొట్టమొదటి విషయం యేమిటంటే, ఉపగ్రహం పరిమాణంలో పెద్దదిగాను, బరువైనదిగాను వుండకూడదు. అదేసమయంలో భూమి చుట్టు తిరుగుతున్న కాలంలో వాతావరణపు పైపొరలయొక్క సమగ్ర భూభౌతిక పరిశోధనను గావింపడానికి వీలైన వైజ్ఞానిక యంత్ర సముదాయం అందులో ఇముడ గలగాలి. అది కాస్మిక్ కిరణాలను, భూమియొక్క అయస్కాంత క్షేత్ర ప్రభావాన్ని, ఉల్కలు, సూక్ష్మ ఉల్కల శక్తిని, ఇతర విషయాలను నమోదు చేయగలగాలి. అలా నమోదు చేయబడిన వివరాలన్నీ నమ్మకంగా, కచ్చితంగా ప్రసారం చేయబడాలి. అందువల్ల పరిగ్రహింపబడిన వివరాలు భూమిమీద లభ్యమయ్యేందుకు నమ్మకంగా, కచ్చితంగా నమోదుచేసే యంత్రాలు, రేడియో ప్రసారయంత్రాలు కృత్రిమ ఉపగ్రహంలో వుండాలి.



ఎప్పటికప్పుడు కృత్రిమ ఉపగ్రహం సంకేతాలను అంతరిక్షంలోనుంచి పంపుతున్నది. అంతరిక్షంలో ఉపగ్రహం పయనిస్తుంటే అనేక రేడియో కేంద్రాలు, వేలాది రేడియో శ్రోతలు దానిని ప్రతీక్షిస్తున్నారు. "అదుగో, సంకేతం!" అని మాస్కో సమీపంలోని రేడియోస్టేషన్ ఆపరేటర్, వాలెన్తినా నికులెన్కోవా ఉత్సాహంతో అంటున్నది

వాతావరణం యొక్క పై పొరలను, భూమండలాన్ని ఆనుకొని వున్న వాతావరణాన్ని గురించి పరిశోధనలు జరపడానికి కృత్రిమ ఉపగ్రహాలు విస్తారమైన అవకాశాలను కల్పిస్తాయి. కృత్రిమ ఉపగ్రహాల్లో యేర్పాటు చేయబడే కొలత యంత్రాలు వాతావరణపు అంతస్తులలో ఒకచోటు విషయాలనేగాక, ఆ మండలపు అన్ని ప్రాంతాల పరిస్థితులనూ తెలియజేస్తాయి.

ప్రస్తుత దశలో పంపబడుతున్న కృత్రిమ ఉపగ్రహాలు భూమికి తిరిగిరావు. సమంగా వుండే వాతావరణపు పలుచని పైపొరలలో తిరుగుతూ అవి కొంతవేగాన్ని గోల్పోయి, దట్టంగా వుండే వాతావరణ దిగువపొరల్లో ప్రవేశించి, గాలి రాపిడికి వేడెక్కి, కాలిపోతాయి. అందువల్ల, విజ్ఞాన శాస్త్రవేత్తలు, కృత్రిమ ఉపగ్రహంనుండి రేడియోద్వారా పంపబడే వాతావరణపు పైపొరలకు సంబంధించిన సమాచారంతోనే తృప్తిపడవలసి ఉంటుంది. ఈ సమాచారం అత్యంత విలువైనదే నయినప్పటికి, కొంతవరకు పరిమితమైనదే. కాబట్టి యిప్పుడు విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు, కృత్రిమ ఉపగ్రహాన్ని, దానిలోని యంత్రాలన్నిటితోపాటు యేమీ చెడకుండా భూమికి తీసుకురావడం ఎలాగన్న విషయాన్ని పరిష్కరించడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. ఈ సమస్యా పరిష్కారం గొప్ప సైద్ధాంతిక, ప్రాక్టికల్ ప్రాముఖ్యతను కలిగి వుంటుంది.




భూమిచుట్టూ పరిభ్రమిస్తోన్నప్పుడు, కృత్రిమ ఉపగ్రహపు ప్రక్షేప వక్రం



# అక్టోబరు విప్లవం

## జవహర్‌లాల్ నెహ్రూ

"....సోవియట్ విప్లవం మానవసమాజాన్ని పెద్ద అంగతో పురోగమింప జేసిందనడానికీ, ఆర్పివెయ్యడానికి సాధ్యంకాని జ్యోతిని వెలిగించిందనడానికీ, ప్రపంచం పురోగమించగల నూతన నాగరికతకు అది పునాదులు వేసిందనడానికీ నాకు సందేహంలేదు...."

భారత సందర్శనం నుండి. పుట 15.

....రష్యన్లు కొత్త ప్రజలుకాదు, అయినా పాతవాటినుండి పూర్తిగా విడిపోవడం జరిగింది, మృత్యువునుండి విడిపోయినట్టుగా. వారు మళ్ళీ కొత్తగా పునరవతరించారు; దీనికి చరిత్రలో ఉదాహరణ లేదు. ఆశ్చర్యకరమైన శక్తితోనూ, బలంతోనూ వారు మళ్ళీ యవ్వనులయ్యారు. వారు మళ్ళీ కొన్ని తమ పాత వేరులకోసరం అన్వేషిస్తున్నారు, కాని వారు ముఖ్య విషయాలన్నిటిలో కొత్త ప్రజలు, ఒక కొత్తజాతి, వారిదొక కొత్త నాగరికత.

"ఒక ప్రజ కష్టనష్టాలను పడడానికి సిద్ధపడినట్టయితే ఎలా తిరిగి పునరుజ్జీవనాన్ని పొందుతుందో, మళ్ళీ ఎలా యవ్వనాన్ని కోలుకుంటుందో, ప్రజాసామాన్యంలోని అణచివేయబడిన శక్తి ఉత్సాహాలను ఎలా ఉపయోగించుకోగలుగుతుందో రష్యా ఉదాహరణ తెలియజేస్తుంది. బహుశా యీ యుద్ధం, దాని బీభత్సాలు, భయోత్పాతాలన్నిటిలో మరణ హోమంనుండి బయట పడగలిగిన యితర ప్రజల పునరుజ్జీవనానికి కూడా కారణం కావచ్చును."

భారత సందర్శనం నుండి. పుట 43.

## రవీంద్రనాధ్ టాగూర్

"....విజ్ఞానశాస్త్ర ఇంద్రజాలం ద్వారా అసాధ్యాలను సాధించే పశ్చిమ ఖండాన్ని చూసినప్పుడు, నేను మెచ్చుకుంటాను. కాని యిక్కడ బరుగుతోన్న మహత్తర విషయాలు నన్ను అత్యంత ఆశ్చర్య పరిచాయి. భయంకర వినాశన చర్య మాత్రమే అయినట్టయితే, నేను యింతగా ఆశ్చర్యపడివుండేవాణ్ని కాదు; వారికి వినాశక శక్తులు కొల్లలుగా వుండడంవల్ల. కాని ఒక విశాలభూమిలో నవ ప్రపంచాన్ని నిర్మించడానికి వారు నడుముకట్టడం నాకు గోచరించింది. ప్రపంచమంతా వారికి విరోధంగా వుండడంవల్ల, ప్రతి ఒక్కరూ వారికి వ్యతిరేకంగా వుండడంవల్ల, వారు జాగు చెయ్యలేకపోయారు, సాధ్యమైనంత వేగంగా వారు నిటారుగా నిల్చోవలసివుంది. తాము కోరేది తప్పుగాని, బూటకంగాని కాదని వారు ఆచరణలో నిరూపించవలసి వుంది. వేల సంవత్సరాలలో చేయబడిన దానిని పది, పదిహేనేళ్ళలో చేయడానికి వారు ప్రతిజ్ఞ చేశారు. ఆర్థిక శక్తి విషయంలో యితరదేశాలతో సరిపోల్చినట్టయితే వారు లెక్కలోకి రారు, కాని వారి దీక్ష అచంచలమైనది.

"ఈ జరిగిన విప్లవం, రష్యాలో జరిగేందుకు చాలా కాలంగా వేచి వుంది. చాలా కాలంగా దీనికోసరం సన్నాహాలు చేయబడ్డాయి. ఎందరు, తెలిసినవారూ తెలియనివారూ ఎందరు తమ ప్రాణాలను త్యాగంచేసి, యీ దీర్ఘకాలంలో భరింప శక్యంకాని కష్టాలు పడ్డారో.

---

జవహర్‌లాల్ నెహ్రూ. ప్రప్రథమంగా ప్రకటితమవుతున్న ఈ ఛాయాచిత్రం మాస్కోలోని, చారిత్రక కినో ఛాయాచిత్ర సంచయంలో లభ్యమైనది

విప్లవానికి కారణాలు చాలావరకూ వ్యాపించి వుంటాయి, కాని అవి కొన్ని స్థలాలలో కేంద్రీకరించి వుంటాయి. శరీరంలోని రక్తం అంతా చెడిపోయినప్పటికీ, కురుపులు కొన్ని నీరసపు స్థలాలలో మాత్రమే వ్రణాలు అవుతాయి. ఈ రష్యాలోనే పేదలూ, దుర్బలులూ — భాగ్యవంతులూ, బలవంతులూ పెట్టిన భరింప శక్యంకాని బాధలు పడ్డారు. ఈ రష్యాలోనే రెండు పక్షాల మధ్యగల విపరీతమైన భేదాలు, చివరికి విప్లవంద్వారా పరిష్కృతం కావడానికి పూనుకున్నాయి.

"ఈ అసమానతే ఒకప్పుడు ఫ్రెంచి విప్లవానికి కారణమయ్యింది. అప్పుడక్కడి పీడితులు యీ అసమానత బాధ అవమానమూ ప్రపంచమంతటికీ వుందని గ్రహించారు. అందువల్లనే స్వాతంత్ర్యం, సమానత్వం, సహోదరత్వం అన్న ఆ విప్లవ సందేశం దేశాల సరిహద్దులను దాటి వెళ్ళింది. కాని అది నిలవలేదు. ఇక్కడకూడా విప్లవ సందేశం సర్వత్రా వ్యాపించినదే. కనీసం ప్రపంచంలోని యీ ఒక్కదేశపు ప్రజలైనా, తమ జాతీయ ప్రయోజనాలను మించి అందరి ప్రజల ప్రయోజనాల గురించి నేడు ఆలోచిస్తున్నారు...."

రష్యా గురించి లేఖలు నుండి,
బెంగాలీ మూలప్రతి, పుటలు 13-14

"....నాకు మాస్కోనుండి ఆహ్వానం వచ్చినప్పుడు, బోల్షివిక్కుల గురించి నాకు స్పష్టంగా ఏమీ తెలియదు. వారి గురించి ఎప్పుడూ నాకు భిన్నభిన్నమైన సమాచారం తెలుస్తూ వుండేది. వారి గురించి నా మనస్సులో అనుమానాలుండేవి. ఎందువల్లనంటే మొదట్లో వారి పద్ధతి, బలాత్కార పద్ధతి. కాని నేనొక విషయాన్ని గమనించాను; అదేమిటంటే వారిపట్ల యూరప్‌లో శత్రుభావం కొంతవరకూ సన్నగిల్లింది. నేను రష్యాకు వస్తున్నానని విని, చాలామంది నన్ను ప్రోత్సాహ పరిచారు. చాలామంది ఆంగ్లేయులు కూడా వారిని ప్రశంసిస్తూ వుండడం నేను విన్నాను—వారు గొప్ప ప్రయోగంలో నిమగ్నులై వున్నారని చాలామంది నాకు చెప్పారు.

"ఇంకోవేపున చాలామంది నన్ను బెదరగొట్టారు గూడా. వారి బెదిరింపులో ముఖ్యమైనది, సదుపాయంగా వుండదని; ఆహారం మొదలైనవి చాలా మోటుగా వుంటాయని, వాటిని నేను భరించలేననీ వారు చెప్పారు. ఇంతేకాకుండా చాలామంది, వారు నాకు చూపే దానిలో ఎక్కువ భాగం, యిందుకోసరం తయారుచేసి పెట్టినదిగా వుంటుందనికూడా చెప్పారు. నా వయస్సులో, నా ఆరోగ్య పరిస్థితులలో రష్యాలో ప్రయాణం చేయడం సాహసమేనని ఒప్పుకోక తప్పదు. కాని ప్రపంచం అంతటికీ గొప్పదైన చారిత్రిక యజ్ఞం జరుగుతోన్న చోటికి, ఆహ్వానం వచ్చాకకూడా వెళ్ళకపోయినట్టయితే క్షంతవ్యం కాదు."

రష్యా గురించి లేఖలు నుండి,
బెంగాలీ మూలప్రతి, పుటలు 15-16.

"....పశ్చిమ ప్రపంచమంతటి రూక్షణ వీక్షణాలను యెంతమాత్రమూ పాటించక, ఆర్థికంగా బలవత్తరమైన పశ్చిమ నాగరికత ముఖద్వారం వద్దనే పేదల శక్తిని జ్వలింపజేయడానికి నేడు పూనుకున్న రష్యాను, నేను కాకపోతే యింకెవరు చూడగలరని నేను అనుకుంటున్నాను. బలవంతుల బలాన్నీ, ధనవంతుల ధనాన్నీ సమమట్టంగా చేయడానికి వారు పూనుకుంటే, మనమెందుకు బెదిరిపోవాలి, మనమెందుకు కోపం తెచ్చుకోవాలి? మన బలంగాని, మన భాగ్యంగాని ఏపాటివి? ప్రపంచంలోని క్షుధార్తుల లెక్కలోనికీ, నిస్సహాయుల లెక్కలోనికీ మనం వస్తాముగదా.

"బలహీనులను రెచ్చగొట్టడానికి వారు పూనుకున్నారని

(మిగత 62వ పుటలో)



సోయుజ్కినో కార్యాలయాలలోని ఒక ఫిల్మ్ కళాకారుల బృందంతో రవీంద్రనాథ టాగూర్ సంభాషిస్తోన్న దృశ్యం. మాస్కో, 1930

(1వ పుట తరువాయి)

ఈ చారిత్రిక క్రమం, ప్రపంచంపైని గుత్త పెత్తనం గల సాంఘిక, రాజకీయ వ్యవస్థ బ్రద్దలవుతూ వున్నదని తెలియజేస్తోంది. ఇది పలస వ్యవస్థ బ్రద్దలవడాన్నికూడా సూచిస్తుంది. ఇంకా వలస పాలనక్రింద నున్న దేశాలలో 16 కోట్ల మంది ప్రజలు జీవిస్తూ వున్నప్పటికీ, సామ్రాజ్యవాదం ఒక మిలియన్ల్ బానిసలను కోలు పోయింది. ఆసియా, యించుమించుగా తన్నుతాను విముక్తి గావించు కుంది. ఆఫ్రికా విముక్తి చెందుతోంది.

గత నలభై ఏళ్ళ ప్రముఖ ఫలితాలవి. అక్టోబరు సామ్యవాద మహా విప్లవ వార్షికోత్సవాన్ని సోవియట్ దేశ ప్రజలు మాత్రమే కాకుండా, యింకా చాలా యితరదేశాల ప్రజలుకూడా జరుపుతూ వుండడంలో ఆశ్చర్యమేమీ లేదు. నలభై ఏళ్ళలో ఒక నవజగత్తు నిర్మితం అవడం మాత్రమే కాకుండా, విప్లవ నిర్మాణ కృషి సాగుతూ వుండడమూ, ప్రపంచ చారిత్రిక క్రమం యింకా ముందుకు, యింకా ముందుకు పురోగమిస్తూ వుండడమూ వారు చూస్తున్నారు. ఇది తిరుగు లేనిది. ఆపడానికిగాని, మరల్చడానికిగాని సాధ్యం కానిదిది.

కాని యిందుకు అంగీకరించనివారు కొందరున్నారు. సామ్య వాద విప్లవం కేవలమూ తాత్కాలికమైన విస్మయమూ, ఒక ఉదంతమూ మాత్రమేననీ, ఆయుధ బలంవల్ల చరిత్రను వెనుకకు మరల్చ వచ్చుననీ 40 ఏళ్ళ క్రితం నమ్మినవారివంటి వారే వీరు. సోవియట్ రష్యాపైకి 14 దేశాల సాయుధసేనలను ఎగద్రోలి, సామ్యవాదాన్ని బాల్యావస్థలోనే చంపడానికి ప్రయత్నించిన వారివంటివారే వీరు. ఇరవై ఏళ్ళ ఘోర పరాజయం పొందిన తరవాతకూడా సోవియట్ దేశానికి వ్యతిరేకంగా హిట్లర్ జర్మనీని ఉసికొల్పిన వారివంటి వారే వీరు. వీరు అమెరికా, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీల సామ్రాజ్య వాదులు.

వీరే, అమెరికన్ కోటీశ్వరుల ఆధిపత్యానవున్న యీ సామ్రాజ్యవాదులే, ప్రపంచ చరిత్రను ఆపి వెనుకకు మళ్ళించే అదే ఉద్దేశంతో, సామ్యవాదాన్ని, ప్రజల స్వాతంత్ర్యాన్ని కూలద్రోసే, ప్రపంచమంతటా పెట్టుబడిదారీ పరిపాలనను పునరుద్ధరించే ఉద్దేశంతో యిప్పుడు మూడవ ప్రపంచ యుద్ధానికి సన్నాహాలు చేస్తున్నారు. ఈ సారి వారు సామ్యవాద శిబిరమంతటికీ వ్యతిరేకంగా, స్వతంత్ర రాజ్యాలన్నిటికీ వ్యతిరేకంగా, వాస్తవానికి మానవజాతికంతటికీ వ్యతి రేకంగా యుద్ధానికి సన్నాహాలు చేస్తున్నారు.

తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను జయించుకున్న ప్రజలు సామ్రాజ్యవాదుల దురాక్రమణ విధానాన్ని, శాంతి విధానంలో వ్యతి రేకిస్తున్నారు. సామ్రాజ్యవాద బందిపోటు దొంగలను వారు యిప్పటి వరకూ అరికట్టగలిగారు. కాని సామ్రాజ్యవాదులు భయంకర యుద్ధాన్ని ప్రారంభించగలిగితే, దాని ఫలితాలను దూరదృష్టితో జోస్యం చెప్ప డం కష్టమేమీ కాదు.

ప్రథమ ప్రపంచయుద్ధం తరవాత యిరవై కోట్ల మంది ప్రజలు పెట్టుబడిదారీ పరిపాలననుండి తప్పించుకుని విముక్తులయ్యారు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం తొంభై కోట్ల మందికి పైగా ప్రజలు సామ్యవాదాన్ని నిర్మిస్తున్నారు, అరవై కోట్ల మంది వలస దాస్యాన్ని వదుల్చుకున్నారు. అయినా, ఎటువంటి గుణపాఠమూ నేర్చుకోని రాజకీయాంధులూ, ఎంతకైనా వెనుదియ్యని సాహసికులు తృతీయ ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించినట్లయితే, సామ్రాజ్యవాదమూ, వలస విధానమూ ఎంతవరకూ మిగులుతాయి ?

సామ్రాజ్యవాదం యింకా దృఢంగావుంది. దాని శక్తిని తక్కువగా అంచనా వేయకూడదు. కాని యీ శక్తిని ఎక్కువగా అంచనా వేయడం యింతకంటె కూడా ప్రమాదకరం. పరాజయాలు, సంక్షోభాలూ, వైరుధ్యాలు కలిగినప్పటికీ యీ విధానం పెంపొందు తూనే వుంది. దోపిడీని తీవ్రతరం చేయడంద్వారా అది తను మను గడను పొడిగించడానికి ప్రయత్నిస్తూ వుంది. సామ్యవాద ప్రపంచం యింకా దృఢతరంగా వుంది. దాని ఆర్థికశక్తి దృఢతర ప్రగతికి విస్పష్ట నిరూపణను, యీ దిగువ పారిశ్రామికాభివృద్ధి తారతమ్యం ద్వారా తెలుసుకోవచ్చును :

| | 1950 | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
|---|---|---|---|---|---|---|
| సామ్యవాద దేశాలు | 100 | 120 | 138 | 158 | 177 | 195 |
| సామ్యవాదేతర దేశాలు | 100 | 109 | 111 | 119 | 119 | 131 |

నలభై ఏళ్ళ కాలంలో, మొత్తం ఉత్పత్తిలో అమెరికా తర్వాత ప్రపంచంలో ద్వితీయ స్థానాన్ని ఆక్రమించుకుని సోవియట్ దేశం, అత్యంత భాగ్యవంతమైన పెట్టుబడిదారీ దేశాన్ని జయప్రదంగా కలుసుకుని, కొద్ది ఏళ్ళలో అధిగమించడానికి ఉద్దేశిస్తూ వున్నది.

మా నలభైయ్యవ వార్షికోత్సవం, యింకా కష్టపడి పని చెయ్య వలసిన, పెద్ద నిరోధాలను ఎదుర్కొ-వలసిన, పట్టుదలగా పోరాడ వలసిన దీర్ఘపథంలో ఒకమైలురాయి. ఆశావాదం, అశ్రద్ధను సూచిం చదు. నలభై ఏళ్ళ చరిత్ర, నలభై ఏళ్ళ పోరాటంకూడా. దారిలో కష్టాలున్నాయి, త్యాగాలు చేయాలి—కాని పరాజయాలు లేవు. మా శత్రువులు కోపించినకొద్దీ, మేము ఎక్కువగా మిత్రులను సంపా దించాము. ఎంతో ప్రతిభావంతులూ, సంస్కృతీపరులూ అయిన భార తీయ ప్రజలను మేము పలుకరించిన ఆ రోజులు, మరపురానిరోజులు. శాంతి మహాసమరంలో మనము కలసిమెలసి పురోగమిస్తాము.

మా నలభైయ్యవ వార్షిక శిఖరంనుండి, భావి అవకాశాలు అద్భుతంగా కనిపిస్తున్నాయి. వాటిని మేము సమీపిస్తూన్న కొద్దీ దూరానగల కమ్యూనిజం దీపాలు మరింత తేజోవంతంగా ప్రకా శిస్తున్నాయి. భవిష్యత్తులోనికి చొచ్చుకపోయే మానవుని ఎదుటకు ఒక అద్భుతమైన ప్రపంచం వస్తుంది. మన భూమి ఒక గొప్ప తోటగా మారడం అతడు చూస్తాడు. బీదరికం, దోపిడీ, బలవంతం, కన్నీళ్ళు అనే మచ్చలు అతనికి ఎక్కడా కనిపించవు. పెట్టుబడి దారీ చిహ్నాలేవీ అతనికి కనిపించవు. సోదర ప్రజల బృహత్కు టుంబం తప్పితే, అతని కళ్ళకు యింకేమీ కనిపించదు.

## అంతరిక్షంపై దండయాత్ర

(3వ పుట తరువాయి)

రాకెట్‌ను ప్రయోగించింది. మానవులనందర్నీ అబ్బురపరిచిన మహాకవార్త ఇప్పుడు వచ్చింది. సోవియట్ ప్రజలు భూమి కృత్రిమ గ్రహాన్ని అంతరిక్షంలోకి ఎగురవేశారు.

ఇవన్నీ వాస్తవ విషయాలు. కాని అవన్నీ లెనిన్ చెప్పిన విషయాలూ, ప్రజల్లో ఆయనకుగల విశ్వాసం సక్రమమైనవనీ, ఆ ఇంగ్లీషు రచయిత ఊహలు పొరపాటైనవనీ రుజువు చేస్తాయి.

మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహం చిన్నది, చాలా చిన్నది అన్నమాట నిజమే. కాని అప్పుడే ప్రజలు చిన్నవాటిలో మహత్తర విషయాలను కనుగొనడం నేర్చుకొన్నారు. 58 సెంటిమీటర్లు, వ్యాస రేఖ, 83.6 కిలోగ్రాముల బరువుగల యీ లోహపు బంతి నూతన శకాన్ని ప్రారంభిస్తున్నది. అంతరిక్షంలోకి ఇతర గ్రహాలకు మానవుని ప్రయాణాన్ని సాధ్యంగావింపబోతున్నది.



స్నానాలతొట్టిలో హాయిగా
కాలం వెళ్ళబుచ్చుతున్న
చక్కటి పసిపాప






సోవియట్ ఉపాధ్యాయుల ప్రతినిధివర్గం స్కాట్‌లెండులో పర్యటిస్తున్న సమయంలో, అప్పుడే సోవియట్ యూనియన్ నుండి తిరిగివచ్చిన డీన్ ఆఫ్ కాంటర్ బరీ, హెవ్లెట్ జాన్సన్‌ను, సోవియట్ దేశంలో ప్రత్యేక సౌకర్యాలుగల వర్గాలేవైనా ఉన్నాయా అని యెవరో అడిగారు.







క్రెచ్చీమీద పైకి క్రిందికి పోవడం నేర్చుకొంటున్న బాలలు

(ముందుపుట) నేను ఇప్పుడు, యీ తూకపు యంత్రాన్ని మించిపొయ్యాను!





# ధికారం కలిగిన వర్గం



"అవును, ఉన్నారు" అంటూ ఆయన కాసేపు ఆలోచించి, "వారే బాలలు" అని సమాధానం చెప్పారు.

అవును, సోవియట్ దేశంలో బాలలు నిజంగానే ప్రత్యేక సౌకర్యాలుగల "వర్గం". లేమి, భయాలంటే యేమిటో తెలియకుండా, ప్రతివారు తమమిత్రులే అయిన యీ ఆనందమయ ప్రపంచంలో ఒంటరితనమనేది స్ఫురింపకుండా భద్రతతో, సుఖంగా పెరుగుతున్నారు వారు.







పల్లెపట్టులోని ఒక వేసంగి శిబిరపు ఆటలస్థల ప్రధాన విభాగ దృశ్యం



వృద్ధిని డాక్టర్ పరీక్షిస్తుంటాడు. తట్టమ్మ, వాయి, [illegible], స్కార్లెట్ జ్వరం మొదలైనవి రాకుండా నర్సు టీకాలు వేస్తుంది. పరిశోధనాలయంలోని అసిస్టెంటులాగ పనిబడుతూవుండే వంటలమనిషి వంటల శాలలో డాక్టర్ ఇచ్చిన సూచనల ననుసరించి ఆ పసి కూనకు పాయసాన్ని, ఫలాహారాన్ని, పండ్ల రసాన్ని తయారుచేస్తుంటాడు.



← స్వెర్డ్‌లావ్‌స్క్ బాల [illegible] భవనం



అధ్యయనంలో గాఢంగా నిమగ్నమైవున్న బాల పండితులు



చైనీస్ నృత్యాన్ని ప్రదర్శిస్తోన్న ఒక సోవియట్ బాలిక

ప్రపంచంలో ఒక నూతన వ్యక్తి ఉద్భవించాడు. ఏది ఎలా చేయాలో ఇంకా తెలియదు, ఒక్కమాటైనా ఉచ్చరించలేడు. కాని అతనిపై చూపే శ్రద్ధ, పడే ఆందోళన చూస్తుంటే అతడు ప్రపంచంలో "అతి ముఖ్యుడ"న్న భావం ఎవరికైనా కలుగుతుంది. ఆ పసికూన బరువు, ఆరోగ్యం, ఆకలి మొదలైనవాటిని గురించి ఎంతో మంది శ్రద్ధను వహిస్తారు. అతని శారీరకాభి



జనసమ్మర్ధం తక్కువగా వుండి, చెట్లనీడలు బాగా వున్న వీధుల్లో, చక్కని వెలుగు, వెచ్చదనంకల శిశుపోషణాలయాలు, బాలోద్యానవనాలు నిర్మింపబడ్డాయి. ఈ వెచ్చని శిశుపోషణాలయాల్లో బాలల ఉపయోగం కొరకు ఫర్నిచర్ యేర్పాటు చేయబడింది.

సౌకర్యవంతమైన ఇలాంటి గృహాల్లో చిన్నారి బాలలు, యే చేతితో స్పూన్ పట్టుకోవాలి, గుండీలు ఉపయోగం యేమిటి అన్న విషయాలను నేర్చుకొంటారు. ప్రపంచంలో కుందేళ్ళు, నక్కలు, ఎలుగుబంట్లు మొదలైన జంతువులున్నాయని తెలుసుకొంటారు. దేవతా కథలలో వీటిని గురించి యెన్నెన్నో విషయాలు నేర్చుకొంటారు. ఇక్కడే తమ మొట్టమొదటి సహచరులను కనుగొని,



నల్ల సముద్రతీరపు "ఆర్తెక్" బాల సంఘ శిబిరం, బాలల శిబిరాలలో కెల్ల సుప్రసిద్ధమైనది

ఆతపస్నాన సౌఖ్యాన్ననుభవిస్తోన్న బాలలు



స్నేహం చేస్తారు.

స్నేహపూర్వకమైన ఇలాటి అనుకూల వాతావరణంలో చిన్నారి బాలలు ఏడు సంవత్సరాలు గడుపుతారు. అటు తర్వాత వారి జీవితంలో ఒక నూతన దశ ప్రారంభమవుతుంది. వాళ్ళ స్కూలు యూనిఫారం లాగూ, చొక్కా ధరించి, తోలుపటకాను బిగించి, పుస్తకాల సంచిని భుజాలకు తగిలించుకొని పాఠశాలకు బయలుదేరుతారు.



భావి నావికులు

ప్రతినగరంలోను, ప్రతిగ్రామంలోను— అది సైబీరియన్ ఆటవికప్రాంతమేగానివ్వండి, కొండలలోని ఉన్నత ప్రాంతమేగానివ్వండి— బాలలకొరకు విశాలమైన పాఠశాలలు నిర్మింప బడ్డాయి. పిల్లలు చదువుకోడానికి అన్ని అవ కాశాలు ఉంటాయి. పాఠశాలల్లోని గ్రంధాల యాలనిండా పాఠ్యగ్రంధాలు ఉంటాయి. అనేక రకాల చిత్రపటాలు, చార్టులు, రక రకాల మోడల్‌లు, మొక్కల నమూనాలు ఉంటాయి. పరిశోధనాలయాలు, ప్రత్యేక క్లాసుగదులలో వివిధ పరికరాలు అమర్చబడి ఉంటాయి. పాఠశాల కర్మాగారాల్లో కొత్త లేతు మిషన్లు గూడా ఉంటాయి.

చిన్నారిబాలలకు వ్రాయడం, చదవడం యింకారాదు. కష్టపడి తమ నోటు పుస్త కాలలో గీతలను, వక్రరేఖలను, వలయాలను గీస్తుంటారు. కాని ఒక సంవత్సరం పూర్తి అయ్యేసరికల్లా బాగా చదవడం వచ్చేస్తుంది. పుస్తకాలు చదవడం ప్రారంభిస్తారు. కొద్ది సంవత్సరాలు గడిచాక ధారాళంగా భౌగోళిక చిత్రపటాలను "చదవడము," బీజగణిత సమస్యలను పరిష్కరించడము, రసాయనిక శాస్త్రం తరగతుల్లో ప్రయోగాలను జరపడము, పుష్కిన్, గోర్కీ, షేక్స్‌పియర్, టాల్ స్టాయ్, మాయకోవిస్కీల రచనలను చదివి వాటిని ప్రేమించడమూ నేర్చుకొంటారు.

పది సంవత్సరాల అనంతరం యీ బాలలు సమగ్రమైన గ్రంధవిజ్ఞానాన్నీ, ప్రాక్టికల్ అనుభవాన్నీ పొంది, జీవితంలో అడుగిడి పనులలో పాల్గొనడానికీ, తమ విద్యాభ్యాసాన్ని ఇంకా కొనసాగించడానికి సంసిద్ధంగా ఉంటారు.

సోవియట్ దేశంలో అందరు బాలలూ చదువుకొంటారు. మొత్తం 213,000 పాఠ శాలలున్నాయి. 30,000,000 విద్యార్థులు చదువుకొంటున్నారు. కాని పరిస్థితులు దీనికి భిన్నంగా వుండిన రోజులు గడిచి ఎంతో కాలం కాలేదు. బాలలు ఫాక్టరీ షాపుల్లోను, భూస్వాముల ఇండ్ల ల్లోను, పొలాల్లోను యేవిధంగా కష్టపడి పని చేస్తూవుండేవారో ఇప్పటి పెద్దవాళ్ళకు ఇంకా గుర్తున్నది. పాఠశాలలకు వెళ్ళవలసిన బాలి కలు ఇండ్లల్లో పనులకు చేరేవారు. బాలురు సారాదుకాణాల్లో పనికి కుదిరేవారు. లేదా బొగ్గుగనుల్లో బొగ్గుబండ్లను తోస్తూవుండేవారు. పెద్దవాళ్ళకే ఇది ఎంతోకష్టమైనపని. అనాధ బాలలు వీధుల్లో బిచ్చమెత్తుకొంటూ, రాత్రులు యెక్కడపడితే అక్కడపడి నిద్రపోతుండే వారు.

కాని విప్లవం వీటన్నింటిని తుదముట్టం చింది. సోవియట్ పరిపాలన మొదటి సం వత్సరాలలోనే, నూతన రిపబ్లిక్ బాలలను పనులలో పెట్టడాన్ని నిషేధిస్తూ, వారికి తప్పని సరిగా విద్యాభ్యాసం జరుగాలని నిర్దేశిస్తూ శాస నాలను చేసింది. ఆ రోజుల్లో సోవియట్ రిప బ్లిక్‌కు నిధులు తక్కువగా వున్నప్పటికి ప్రభు త్వం పాఠశాలలు, హాస్పటళ్ళు, బోర్డింగ్ పాఠశాలలు, బాలల ఆహారశాలలు, బాలోద్యాన వనాల నిర్మాణంకొరకు పెద్ద మొత్తాలనే కేటా యిస్తూ వచ్చింది. ఈ విధంగా, సోవియట్ ప్రభుత్వపు మొదటి దశనుండే, బాలలను జాగ్రత్తగా పరిపోషించడం, దేశంలోని ఉత్తమమైనవి వారికి లభింపజేయడం ఒక సంప్రదాయంగా యేర్పడిపోయింది. దేశం ఎంత సౌభాగ్యవంతమవుతుంటే అంత ఎక్కు వగా నిధులు బాలల పరిపోషణకొరకూ, విద్య కొరకూ కేటాయింపబడడం జరుగుతున్నది. ఈ నాడు సోవియట్ బాలలు ఆనందంగాను, భద్రతతోను జీవితాన్ని గడుపుతున్నారు.

....ఒక చక్కని పార్కులో అద్భుతమైన ఒక శ్వేత భవనం వున్నది. విశాలమైన దాని కిటికీలలోంచి చూస్తే, సున్నగా గచ్చు చేయ బడిన పై కప్పు, ఆ కప్పుపై నుండి వ్రేళ్ళా డుతూ దీపాలుపెట్టే గాజుసెమ్మె, పాలరాతి స్థంభాలపైన చిత్రాలు అగుపడుతుంటాయి. ఈ భవనం ఒకప్పుడు ఒక బంగారు గని యజ మానికి చెంది వుండేది. కాని ఇప్పుడది ఉరల్స్‌లోని స్వెర్డ్‌లోవ్స్క్ నగర బాలలకు చెంది వున్నది. ఈ మహాభవంతిలో ఇప్పుడు చిత్రాలు, శిల్పాల స్టుడియోలు, రేడియో, ఎల క్ట్రిక్ పరిశోధనాలయాలు, వర్కుషాపులు, గ్రంధాలయాలు వున్నాయి. దానిలోని పెద్ద హాలులో గాన కచేరీలు, నాటకాలు జరుగు తుంటాయి. బాలలు పండ్లతోటలను నాటారు. ప్రయోగాలు జరుపడానికి పార్కులో కొన్ని క్షేత్రాలు వున్నాయి.

....బ్రహ్మాండమైన నీలి అలలు నల్ల సము ద్రం తీరాలను మృదువుగా తాకుతూవుంటాయి. ఆ సముద్రతీరంలో వున్న నగరంలోని విశాల మైన భవనాలు పార్కులలోని దట్టమైన చెట్ల మధ్య మరుగుపడి వున్నాయి. యెవతోరియా అనే ఆ నగరం చాలా ఆకర్షవంతంగా వుం టుంది. కాని జనాభాలో అధికభాగం బాలలు. వారంతా, ప్రభుత్వం తమకుకట్టించిన ఆరోగ్య కేంద్రాలలో కాలం గడపడానికి దేశం అన్ని మూలలనుండి వచ్చినవారే.

....ఓల్గా నదిమీద ఒక తెల్లని డబుల్- డెక్కర్ నౌక వేగంగా పోతున్నది. స్టీరింగ్ వీల్ దగ్గర ఒక పదహారేళ్ళ బాలుడున్నాడు. కేప్టెన్‌గూడా యేమంత పెద్ద వయస్సువాడు కాడు. నావికులైతే ఇంకా తక్కువ వయస్సు వాళ్ళు. నౌక సిబ్బంది మొత్తం వేసవిలో నావికులు వేసుకొనే యూనిఫారమ్‌ను వేసు కొని వున్నారు. ప్రక్కనుండిపోతున్న నౌకల లోని వాళ్ళు ఈ నౌకను తదేకదీక్షతో చూస్తూ "ఎంత సొగసుగా వుంది!" అనుకొంటు న్నారు. ఆ నౌక అందర్నీ ఆకర్షించడంలో ఆశ్చర్యమేమీ లేదు. అందంగా, తేలికగా వున్న యీ నౌక, బాలలు ఓల్గా నదిపై నౌకా యానాన్ని నేర్చుకోడానికి ప్రత్యేకంగా తయారు చేయబడ్డది.



పాఠశాలలో జరుగనున్న కళాప్రదర్శనకు సన్నాహాలు చేస్తోన్న బాలకులు





ఏటేటా, నవ సంవత్సరాదికి, క్రెమ్లిన్‌లో, బాలలకు నృత్యోత్సవం జరుపబడుతుంది. వేడుకలప్పటి క్రెమ్లిన్ భవన ప్రాంగణ దృశ్యం

సోవియట్ దేశంలో పిల్లలకొరకు ప్రత్యేకించి జరుపబడుతున్న పనుల పట్టికను ఇవ్వడం అర్థంలేని పని. కాని అంకెల భాషలో వాటిని గురించి చెబితే బాగా అర్థమవుతాయి. సోవియట్ల దేశంలో బాలలకు 1,100 బాలల ఆరోగ్య కేంద్రాలు, 2 382 బాలల భవనాలు, బాల సంఘం గృహాలు, 470 బాల సాంకేతిక నిపుణల కేంద్రాలు బాలప్రకృతి ప్రేమికుల కేంద్రాలు. 135 హైకింగ్ కేంద్రాలు, 135 బాలల పార్కులు, 6,000 బాలల గ్రంథాలయాలు. పెద్దల గ్రంథాలయాలలోని బాలల విభాగాలు, 101 బాలల కీలుబొమ్మల నాటక శాలలు, 30 బాలల రైల్వేలు, 792 బాలల క్రీడా శిక్షణాలయాలు వున్నాయి. మరికొన్ని సంఖ్యా వివరాలను చెప్పడంగూడా సమంజసంగా వుంటుంది. సోవియట్ దేశంలో ప్రస్తుతం 22,000 స్థిరమైన శిశుపోషణాలయాలు, 13,500 బాలల సలహా కేంద్రాలు వున్నాయి. బాలల వైద్య కేంద్రాలలో 35,000 మంది డాక్టర్లు పని చేస్తున్నారు. ఒక్క గత సంవత్సరంలోనే 100,000 మంది బాలలు బాలల ఆరోగ్య కేంద్రాలలో విశ్రాంతిని తీసుకొన్నారు. 5,500,000 మంది బాలసంఘ శిబిరాలలో తమ వేసవి సెలవులను గడిపారు. 300,000 మంది టూరిస్టు, హైకింగ్ యాత్రలలో పాల్గొన్నారు. పాఠశాలకు వెళ్ళేవయస్సు ఇంకా రాని పిల్లలు 2,000,000 మంది వేసవిని గ్రామీణ ప్రాంత గృహాలలో గడిపారు.

ఈ విధంగా సోవియట్ దేశంలోని బాలలు ప్రజల ప్రేమలోను, ప్రభుత్వంచూపే జాగ్రత్తలోను హాయిగా జీవితాన్ని గడుపుతున్నారు. ఎంతో ఆదరణగల మాతృదేవివలె మా దేశం ఆరోగ్యవంతంగా బాలలను పెంచుతున్నది, భద్రత గల భవిష్యత్తును కల్పిస్తున్నది.



# శాంతి!

సోవియట్ రాజ్యస్థాపనానంతరం తొలి గంటలలో జరిగిందీఘటన. జరిగినదాని అర్థాన్ని పూర్తిగా గ్రహించిన వారు కొద్దిమంది. రష్యాలో సైతం, సోవియట్ ప్రభుత్వోదయాన్ని యింకా ఎక్కువమంది తెలుసుకోలేదు. అప్పుడు లెనిన్, స్మోల్నీలో వేదికపై వున్నారు, శాంతిగురించి ప్రసిద్ధ తీర్మానాన్ని చదువుతూ.

శాంతి!

శాంతి!

రష్యా శాంతిని ప్రతిపాదిస్తోంది!

యుద్ధంలో పాల్గొంటూన్న దేశాలన్నిటినీ, అన్ని ప్రభుత్వాలనూ ఉద్దేశించి, వెంటనే, న్యాయమైన, ప్రజాస్వామిక శాంతిని చేపట్టవలసిందిగా హెచ్చరించబడింది. ఘంటా రావంతో యీ మాటలు ప్రపంచమంతటికి ఎగిరివెళ్ళాయి.

సోవియట్ రష్యా చేసిన హెచ్చరిక ఒక ప్రతిపాదనవలెకాక, నూతన సామ్యవాద రష్యా రూపొందించిన దీక్షాయుత వాంఛవలె ధ్వనించింది.

తీర్మానంలో యిలా వుంది: "యుద్ధంలో అలసిపోయి, బాధపడి శ్రమపడిన పోరాటంలో

పాల్గొన్న సకల దేశాల శ్రామిక వర్గాలూ, కష్టజీవుల్లో అత్యధిక సంఖ్యాకులుకోరే—జారిస్టు రాచరికం కూలద్రోయబడినప్పట్నుండీ రష్యన్ కార్మిక కర్షకులు అతి ఖచ్చితంగా, పట్టుదలగా కోరుతోన్న న్యాయయుతమైన, ప్రజాస్వామికమైన శాంతి అంటే, ఆక్రమణలు లేకుండా (అంటే విదేశీభూముల ఆక్రమణ లేదా, విదేశాలను బలవంతంగా కలుపు కోవడమూ) నష్టపరిహారాలు లేకుండా సత్వర శాంతి అని ప్రభుత్వం భావిస్తోంది.

నాలుగో సంవత్సరంలో వున్న ప్రపంచ యుద్ధాని ఆపదానికి యుద్ధంతో వేసారిపోయిన ప్రజలందరూ వాంఛించినటువంటి శాంతి అది. చాలా దేశాల సామ్రాజ్యవాద కర్ణాలు మృగాలచే రహస్యంగా పన్నబడి దేశాల అభిమతానికి వ్యతిరేకంగా ప్రారంభింపబడి, అది సామాన్య ప్రజలకు ఉన్మాద కారిన్యంతో దెబ్బ కొట్టింది.

మెర్నెవద్ద, వెర్డన్‌వద్ద జరిగిన పోరాటాలు, మసూరియన్ చిత్తడి భూములలో జరిగిన హత్యలు; వైప్రెస్‌పైని జరిగిన గ్యాసు దాడి, జోట్లండ్ నౌకాయుద్ధం —యుద్ధంలో జరిగిన భయంకర కృత్యాలు యిటువంటివి.

వ.స. అలెక్స్యేవ్

లక్షలాదిమంది విధవలు, లక్షలాదిమంది అనాథబాలలు, లక్షలాదిమంది వికలాంగులు—యుద్ధ బీభత్సంయొక్క అతి సూక్ష్మమైన సమీక్ష యీవిధంగా వుంటుంది.

నాశనమైన పరిశ్రమ, నిర్మానుష్యమైన గ్రామాలూ, పాడుబడి పోయిన భూములు, ఆకలి—దాని ఆర్థిక దుష్ఫలితాలయొక్క అతి సూక్ష్మమైన సమీక్ష యీ విధంగా వుంటుంది.

యుద్ధంవల్ల విసిగి వేసారిన ప్రజలు శాంతిని వాంఛించారు. కాని ప్రజల వాంఛను పెట్టుబడిదారీ పరిపాలకుల వాంఛకు వ్యతిరేకంగా దృఢంగా నిలుపకలిగిన శక్తి యింకా జన్మించలేదు. జన్మించ లేదుగాని, జన్మించబోతోంది. 1917 అక్టోబరులో అది ప్రపంచం ఆరోభాగంలో సామ్యవాద విప్లవరూపాన్ని ధరిస్తూ పేలింది. రష్యాలో పాత పెట్టుబడిదారీ వ్యవస్థను అది తుడిచిపెట్టి, ఒక నూతన సాంఘిక వ్యవస్థను స్థాపించింది. శాంతి అన్న భావం, దాని తొలి బిడ్డలలో ఒకటి. ద్వితీయ అఖిల రష్యన్ సోవియట్లు కాంగ్రెసు శాంతి గురించి ఆమోదించిన తీర్మానం, గొప్ప తీర్మానం మాత్రమే కాదు. నూతనంగా జన్మించిన ఒక రాజ్యపు కార్యక్రమం అది. గత నలభై ఏళ్ళుగా మా దేశం అవలంబిస్తూ వచ్చిన శాంతియుత విదేశాంగ విధానానికి, యీ తీర్మానం పునాదులనువేసింది.

ఇది సామ్రాజ్యవాద దోపిడీదారులకు గట్టి దెబ్బకొట్టింది. బూర్జువా ప్రభుత్వాలు యీ తీర్మానాన్ని వెలివేసి, దానిలోని విషయాలు తమ ప్రజలకు తెలియకుండా వుంచడానికి శాయశక్తులా ప్రయత్నించాయి. యుద్ధాన్ని ఆపివేయడానికి విప్లవ రష్యా చేసిన ప్రతిపాదనలన్నీ తృణీకరింపబడ్డాయి. అప్పుడు సోవియట్ ప్రభుత్వం శాంతి తీర్మానాన్ని రేడియోపైని ప్రసారం చేయించింది. ప్రజలకు చెప్పడానికి రేడియోను ఉపయోగించడం. మానవ జాతిలో అదే మొదటి




"శాంతి, సర్వజనులకు శాంతి" అన్న నినాదాన్ని బలపరుస్తోన్న ఒక ప్రదర్శనం. 1917.

జినోఆ సమావేశంలో సోవియట్ రాజ్యాంగవేత్తలు, చిచెరిన్, లిట్వినోవ్





సారి. ఈ తీర్మాన పాఠం ప్రపంచమంతటా తెలిసింది.

1922 లో, జినోవా సమావేశంలో మా విదేశాంగ వ్యవహారాల కమిసార్ ఇ. ఛిఛెరిన్ సాధారణ నిరాయుధీకరణకు, యుద్ధంలో విష వాయువుల, అటువంటి పదార్థాల నిషేధానికీ ఒక ప్రతిపాదనను నివేదించారు. కాని సామ్రాజ్యవాద రాజ్యాలు సోవియట్ ప్రతిపాదనను తిరస్కరించాయి. సోవియట్ దేశం చాలా సార్లు యిటువంటి ప్రతిపాదనలను చేసింది. కాని ప్రతిసారీ బూర్జువా రాజ్య నిపుణులు, సోవియట్ దేశ శాంతియుత సూచనను బలపర్చడానికి నిరాకరించారు. ఈ రోజుల్లోకూడా మనం చూస్తున్నది యిదేకదా.

ఈ రోజులు చాలా గొప్పరోజులు. సర్వకాలాలలోనూ ఉత్కృష్టమైన పరిశోధనలు—బీజాణువుపై అధికారం—మానవజాతికి ప్రసాదించిన శకమిది. ఇది మానవజాతికి నమ్మశక్యంగాని అవకాశాలను యదార్థంగా యిస్తుంది.

కాని మనకు కనిపిస్తున్నదేమిటి? ఎటువంటి ఉన్మాదం! ఈ గొప్ప పరిశోధన మానవజాతికి మొదట్లో యిచ్చినది సౌఖ్యమూ, ఆశా కాదు—పరమాణు యుద్ధ ఫలితమైన ఆందోళన, అనిశ్చయత.

పరమాణు, ఉదజని ఆయుధాలను నిషేధించమనీ, వాటి పాటవ పరీక్షలను ఆపివెయ్యవలసిందనీ అనేక సంవత్సరాలుగా సోవియట్ దేశం పట్టుదలగా పదేపదే చెపుతోంది. కాని సోవియట్ శాంతియుత ప్రతిపాదనలు నిర్విఘ్నంగా తిరస్కారావమయ్యాయి. సామ్రాజ్యవాద రాజ్యాల ప్రభుత్వాలు, అది చేదు మందయినట్టుగా, దాని పట్ల విముఖతను చూపాయి.

కాని సోవియట్ రాజ్యం ప్రతిపాదనలను చేయడం మాత్రమే కాదు. అది దృష్టాంతాన్ని చూపుతూ కార్యాచరణను కూడా చేస్తుంది. 1955 లో సోవియట్ దేశ సాయుధ సేనల నుండి 640,000 మంది అధికారులూ, సైనికులు తగ్గింపబడ్డారు; గత ఏడాది యింకో 1,200 వేలమంది తగ్గింపబడ్డారు. ఇతరదేశాల భూభాగాలపైని వున్న తన సైనిక స్థావరాలను వదులుకోవడానికి సోవియట్ ప్రభుత్వ నిర్ణయం అందరికీ జ్ఞాపకం వుంటుంది. అందుకు సోవియట్ దేశం యింకొన్ని చర్యలను తీసుకోవడానికి సిద్ధంగా వుంది.

ఆయుధాలగురించి చేసే ఖర్చు మా బిల్డుకు ధారమనీ, యిళ్లు, పాఠశాలలూ, ఆసుపత్రులూ నిర్మించుకోవడానికీ, పారిశ్రామిక వ్యవసాయాభివృద్ధికీ మాకు కావలసిన సాధనాలను యిది హరిస్తుందనీ మేము భావిస్తున్నాము. మేము చేయవలసినవి ఎన్నో వున్నాయి. మాకు మహత్తరమైన ప్రణాళికలున్నాయి. మాకు శాంతి కావాలి.

ఏ దేశంలోనైతే యుద్ధానంతర కాలపు "సిరిసంపదల"కు అమితాయుధోత్పత్తితో సంబంధం వుందో ఆ అమెరికాలో పరిస్థితులు భిన్నంగా వున్నాయి. భారత దేశానికి మాజీ



పోలిష్ నౌక "బతోరీ" మీద వచ్చిన శాంతి [illegible], లెనిన్‌గ్రాడ్ రేవులో ఘన స్వాగతమిస్తోన్న దృశ్యం



స్టాక్‌హోమ్ శాంతి అభ్యర్థన మీద సంతకాలు చేస్తోన్న దృశ్యం

అమెరికన్ రాయబారి ఛెస్టర్ బౌల్స్ "నూతన ప్రపంచ సమస్యలు" అన్న తన గ్రంథంలో, అమెరికన్ ఆర్థిక వ్యవస్థలోని ఒక పెద్ద భాగం దాని 30 మిలియన్ల యుద్ధ బడ్జెట్‌కు కట్టుబడి వుందని వ్రాస్తున్నారు. అమెరికాలో లక్షలాది మంది "రక్షణ" కొరకు పనిచేస్తున్న పరిశ్రమలలో పని చేస్తున్నారు. సైనిక వ్యయాలలో ముఖ్యమైన కోత జరిగినట్టయితే, దాని ఆర్థిక ఫలితాలను అనుభవించని అమెరికాలోని ఒక మాదిరీ నగరం ఒక్కటికూడా వుండదు.

విభిన్న రాజకీయ వ్యవస్థలు గల దేశాల శాంతియుత సహజీవనభావం, మహా పురుషుడు లెనిన్‌చే చాలా సంవత్సరాల క్రితం రూపొందింపబడింది. ఈ భావాన్ని మేము ఆచరణలో పెడుతున్నాము; భారత దేశం, ఆఫ్ఘనిస్తాన్, ఫిన్లండ్ మొదలైన చాలా దేశాలతో మా సంబంధాలు దీనినే తెలియజేస్తున్నాయి. గత యుద్ధకాలంలో అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన దేశాల ప్రజలతో మా స్నేహం, యీ యదార్థ విషయాన్నే సుస్పష్టం చేయడం లేదా?

మాకు శాంతి కావాలి, సకల దేశాలకు శాంతిని ఆశిస్తున్నాము.

కాని శాంతిని జయించుకోవాలనీ, యుద్ధంలోనూ, వినాశనంలోనూ ఆసక్తిగల బలవత్తరమైన శక్తులున్నాయనీ సోవియట్ ప్రజలెరుగుదురు. ప్రజలు తమ పలుభాషల్లో వద్దు అని చెప్పకపోయినట్టయితే, శాంతి రక్షణ బాధ్యతను తామే స్వీకరించకపోయినట్టయితే, యీ శక్తులది పైచేయి కావొచ్చు.

యుద్ధకారకులను వ్యతిరేకించడంలో ఎల్లప్పుడూ సోవియట్‌దేశం తీవ్రంగా కృషి చేస్తున్నది. ఈ శతాబ్దపు నాల్గల దశాబ్దంలో, దురాక్రమణదారులను—ఇథోపియాను ఆక్రమించుకున్న ఇటలీ, చైనాపైని దండయాత్ర చేసిన సామ్రాజ్యవాద జపాన్, దండయాత్రలకు తలపడ్డ నాజీ జర్మనీ—అరికట్టమని గట్టిగా కోరిన ఏకైకదేశం, సోవియట్‌దేశం. 1941-1945 విషాదకాలంలో సోవియట్‌దేశ పుత్రులు రానున్న తరాలకొరకు శాంతి స్వాతంత్ర్యాలను రక్షించడంలో, తమ రక్తాన్ని ధార పోశారు

యుద్ధప్రచారం, జాతులమధ్య అసమానత్వం, ద్వేషం సోవియట్ వ్యవస్థక్రింద అసాధ్యం. తమ సామ్యవాద నీతికి, ఆదర్శాలకూ యిది విరుద్ధమని సోవియట్ ప్రజలెరుగుదురు: యిది చట్టానుసారంగా నిషిద్ధం.

భారత దేశ శాంతియుత, అభ్యుదయకర విదేశాంగ విధానం, సోవియట్ దేశ గౌరవాన్ని చూరగొన్నది. రెండు ఆసియా మహా దేశాలైన భారత, చైనాదేశాల సూచనపైని "పంచ శీలాలు" ప్రతిపాదింపబడినప్పుడు, వాటికి తన తోడ్పాటును మొదట తెలియజేసిన దేశాలలో సోవియట్ దేశం ఒకటి.

భారత దేశం, చైనా, సోవియట్ దేశాలను బంధించే మైత్రి—వీటి ఉమ్మడి జనాభా మానవ జాతిలో అధికభాగంగావుంది—ప్రపంచ శాంతికి అత్యుత్తమమైన హామీలలో ఒకటని సోవియట్ ప్రజలెరుగుదురు.

శాంతిని జయించుకోవాలి అన్న భావం, యిప్పుడు ప్రజలను సర్వత్రా వశపర్చుకుంది. కాస్త చుట్టూరా చూడండి. సోదరత్వంకొరకు, ఐక్యతకొరకు, మైత్రికొరకు నినాదాలు ప్రపంచం అన్ని భాగాలనుండీ వినవస్తున్నాయి. రష్యన్ అక్టోబరు, నిజంగా ప్రపంచంలో గొప్ప ఆశను వెలిగించింది. సోవియట్ ప్రజలు పూర్వంవలెనే, శాంతియోధుల ప్రథమ శ్రేణులలో వున్నారు. అందువల్లనే నేడు, నలభై ఏళ్ళక్రితంలాగనే అన్ని ఖండాలలోనూ యీ మాటలు వినిపిస్తున్నాయి.

రష్యా చెపుతోంది: శాంతి!

శాంతి!

శాంతి!



# ఐ. అగ్రనోవ్‌స్కి

వేలాది సంవత్సరాలనుండీ మానవజాతి పరిష్కరించవలసివుంటూ వున్న దుస్తర సమస్యలలో ప్రప్రముఖమైన ప్రథమ సమస్య ఆహార సమస్య. ప్రజలందరికీ తినడానికి చాలినంత ఇవ్వగలగడమన్నది. పూర్వపు రష్యాలో ఇదొక సత్వర సమస్యగా వుండేది.

భూగోళ విస్తీర్ణంలో ఆరవవంతు ఆక్రమించుకొనివున్న వ్యావసాయిక దేశం రష్యా, ప్రపంచమొత్తాన ఉత్పత్తి అవుతున్న ధాన్యాల పంటలో అయిదవవంతు ధాన్యాదుల పండిస్తున్న దేశం. యూరోపా, ఆసియా దేశాలలో రష్యన్ గోధుమలు సమృద్ధంగా ఆరగించబడుతున్నప్పుడు తన ప్రజలకు తగినంత రొట్టెను, తినడానికి తిండిని సమకూర్చలేక పోవడమన్నది నమ్మశక్యం కాకపోవచ్చు. క్షామం దేశాన్ని కూకటి వ్రేళ్ళతో పదేపదే పెకలించి, ఓళ్ళు పిప్పిచేసినది. పందలాది, వేలాది ప్రజ 1891 లో ఆకలిమంటలకు ఆహుతైనారు.

“ఎందుకు ప్రజలు ఆకలికి ఆహుతి కావలసి వచ్చిం”దన్న ప్రశ్నకు సమాధానమిస్తూ, ప్రసిద్ధ రష్యన్ రచయిత లియోటాల్‌స్టాయ్ ఇలా వ్రాశారు : “మాకు (ఉన్నత వర్గాలవు) తిండి మిక్కుటమై, ప్రజలు ఆకలికి ఎర కావలసి వచ్చింది. ఏ ప్రజలకైనా, ఇటువంటి పరిస్థితులలో పనిచేయకతప్పనప్పుడు, ఆకలికి ఎర కాకపోవడమన్నది సాధ్యమేనా? అంటే, వారినుండి, వారిని పిండి ఇంతగా పన్నులు వసూలు చేయబడుతున్నప్పుడు, ఒకవైపు తగినంత భూమి లేకున్నప్పుడు, ఉన్న భూమి నిర్లక్ష్యం చేయబడి, కర్కశంగా బీడు పెట్టబడి వున్నప్పుడు, దారుణంగా శ్రమించవలసివున్నప్పుడు, ఆ శ్రమ ఫలితం, పెట్టుబడిదారుల చేత కబళించవేయ బడుతున్నప్పుడు, నగరాలలోని గ్రామీణ కేంద్రాలలోని కలిగినవారు కొల్లగొట్టుకుంటున్నప్పుడు ప్రజలకు మిగిలేది చల్లారని ఆకలికాక మరేమిటి ?” ఆ ఆకలి, “ఉత్పత్తిదారుల, పరాన్నభుక్కుల” అస్తిత్వ కారణంగా సృష్టించబడినదని వ్రాశారు టాల్‌స్టాయ్. టాల్‌స్టాయ్, కలవారు తమ తప్పును బహిరంగంగా ప్రజలముందు గుర్తిస్తారని, “తాము సవారిచేస్తున్న గుర్రాన్ని దిగి, తమకై తాము నడవడం” ప్రారంభిస్తారని, ప్రజల కష్టంమీద బ్రతకడం, కొల్లగొట్టుక తినడం మానేస్తారని ఆశించారు. అయితే అట్లా జరగలేదు. ప్రజలయొక్క ఓర్పుకు, సహనానికి అంతులేకపోయింది. అది సర్వం క్షయమై, ప్రజలు తమమీద స్వారీ చేస్తున్నవారిని కూలద్రోయడానికి నిశ్చయించుకొన్నారు. అందుచే, అన్యాయాన్ని అంతమొందించటానికి, అసమానతలను, పీడనను

నిర్మూలించటానికి, ఆకలి గొన్నవారికి రొట్టె నివ్వాలన్న పురాతన సమస్యను పరిష్కరించడానికి ఉద్యమిస్తున్న ప్రపంచ మహత్తర విప్లవంలో బారులు తీరారు.

## క్లిష్ట సమస్య

కొద్ది సంవత్సరాల స్వల్ప కాలంలో పరిష్కరించటానికి అలవి కాని జటిల సమస్యే కావచ్చు. భూమి, కర్మాగారాలు, గనులు ప్రజల ఆస్తి అయినాయి. అంతమాత్రంతో సత్వరాహారసమస్య పరిష్కృతము కాజాలదు, కాగా సిరిసంపదల పెంపొందించడాన్ని గురించి చెప్పవలసినది లేదు.



విప్లవం తరువాత, పది సంవత్సరాలకల్లా, సోవియట్ దేశం యుద్ధ విధ్వంసనం నుండి కోల్కొని, మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వపు మేరకు ధాన్యాన్ని ఉత్పత్తి చేయగలిగినది. ధాన్యాదుల ఎగుమతులు చాలా వరకు తగ్గించబడినప్పటికీ, పరాన్నభుక్కులు, పెద్ద పెద్ద భూస్వాములు, రైతాంగ శ్రమ ఫలితాన్ని కబళించేవారు రూపరహితమైనప్పటికీ, రొట్టె కొరత ఇంకా ఎంతో దారుణంగానే ఉంది. ముఖ్యంగా ఈ రొట్టె కొరతకు, క్షామానికి నగరాలు ఎక్కువగా గురియైనవి. పారిశ్రామిక ప్రగతి వల్ల, పట్టణాల జనాభా ఎంతో పెరిగిపోయింది. పెరుగుతున్న పట్టణ జనసంఖ్యకు తగినట్టు గ్రామాల నుంచి ధాన్యాదుల సరఫరాల పరిమితులలో పెరుగుదలలేదు; కాగా ఈ సరఫరాలు, విప్లవ పూర్వపు స్థాయికి 50 ప్రతిశతి మేరకు పడిపోయినవి.



డానికీ, వ్యవసాయ వస్తూత్పాదక స్థాయిని అధికతరం చేయగలగడానికీ, ఆ "బలవంతులైన" రైతులు వ్యవసాయ కూలీలను పెట్టుకొనవలసి వస్తుంది, తమకన్న తక్కువ "బలవంతులైన" రైతులనుండి భూమి ఖరీదు చేయవలసి వస్తుంది. ఇది మళ్ళీ అన్యాయానికి దారితీసి, సంపదల నొకవంకకు, దారిద్ర్యాన్ని ఇంకొకవంకకు తేక తప్పదని; ప్రసరాప్రృత మయ్యే అమెరికన్ విధానపు అనుసరణమని విస్పష్టమైనది.



ఒక సమిష్టిక్షేత్రపు ముంగిట, నూర్పులు

పనిదిన-ప్రమాణాన్ని బట్టి ధాన్యపు పంపకం

దేనికి మరి? రైతులు ఇదివరకటికన్న ఎక్కువగా ధాన్యాన్ని వినియోగించుకోవడం మొదలైంది, వాళ్ళు మంచితిండి తింటున్నారు, ఎంతోమంది రైతులు గ్రామాలను విడిచిపెట్టి, పట్టణ ప్రాంతాలలోని కార్మికవర్గంలో చేరిపొయ్యారు. "అమ్మకా"నికని వచ్చే పంట, చిన్న చిన్న కమతాల కలిగివున్న రైతు కుటుంబాల సంఖ్య 15,000,000 నుంచీ 25,000,000 పెరిగిపోవడంతో చాలావరకు పడిపోయింది. స్వల్ప పారిశ్రామికోత్పాదక విధానం ఎంత అవివేకవంతమైనదో అప్పుడు విస్పష్టమైనది; అది వ్యవసాయ యంత్ర ప్రవేశానికి ఎంతమాత్రం చోటివ్వదు, నీటి వనరుల విస్తరణగానీ, వ్యవసాయ సాంకేతిక ప్రవీణుని సేవల వినియోగించుకోవడానికిగానీ సుముఖం కాదు, ఆ చిన్న కుటుంబం అమ్మకానికి ధాన్యాన్ని అదనంగా కలిగివుండడమన్నదే అరుదు.

ఈ పరిస్థితిలో మరి మార్గాంతర మేమిటి? ఎన్నెన్నో ఉపాయాలు, కొత్తకొత్త యోజనలు ప్రతిపాదించబడ్డాయి. కొందరు కార్యశీలురైన రైతులకు సంపదలను కూడబెట్టుకోవడానికి అవకాశాలను కల్పించాలని, దానివల్ల వారి ఉత్పాదనసామర్థ్యం పెరిగి పూర్వపు భూస్వాములను అధిగమించగలరని, వారు యంత్రాలను, రసాయనికపు ఎరువులను ఖరీదుచేసి 'అమ్మకానికి కూడా' ఎక్కువ ఉత్పత్తి చేస్తారని సూచించారు. దీనికి అమెరికా ఉదాహరణ పేర్కొనబడింది. అయితే ఆ రైతులు, ఎక్కువగా సంపన్నులు కావ

కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ ఈ "మార్గాంతరాన్ని" తిరస్కరించక తప్పలేదు. మిగిలినదల్లా ఒకేఒక మార్గము, లెనిన్ సూచించిన సహకార పథకం, వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకొంటున్న చిన్నచిన్న రైతు కుటుంబాలను పెద్ద సహకార (సమిష్టి) క్షేత్రాల క్రింద సంఘటిత పరచాలన్న పథకం. ఈ పథకాన్ని, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ ఆచరణలోకి తీసుకవచ్చింది.

ఈ సమిష్టి క్షేత్రాలకు ట్రాక్టర్లు, ఎరువులు ఇవ్వబడి, వ్యవసాయానికి నీటి వసతులు కల్పించబడ్డాయి. భవన నిర్మాణానికి ప్రభుత్వంనుండి ఋణాలు ఇవ్వబడ్డాయి.

వ్యవసాయ సమిష్టీకరణానికి రైతులు కొనసాగించిన ఐచ్ఛిక ప్రజా ఉద్యమం తరువాత మూడు సంవత్సరాలకు, ధాన్యోత్పత్తి ఒక స్థాయినందుకొని, అమ్మకానికి వచ్చే ధాన్యము 100 ప్రతిశతి పెరిగి, 1913 నాటి ప్రమాణమునకు వచ్చినది.

భారీ-ఎత్తున యాంత్రికీకృతమైన సమిష్టి క్షేత్రాల, ప్రభుత్వ క్షేత్రాల వ్యవసాయ విధానపు, ఇంకొకవిధంగా చెప్పాలంటే "ధాన్య, మాంసోత్పాదక కర్మాగారాల" ప్రయోజనాలు, మరీ ముఖ్యంగా యుద్ధ కాలంలో, గ్రామాదులన్నీ నిర్మానుష్యం చేయబడి, దక్షిణాగాలోని సారవంతమైన ప్రాంతాలను ఫాసిస్టులు ఆక్రమించుకొన్నప్పుడు విస్పష్టం కాజొచ్చాయి. పరిస్థితులకు ఎదురీద గలగడమేగాకుండా,

సామ్యవాద వ్యవసాయ విధానం ప్రజలయొక్క, సైన్యంయొక్క, పరిశ్రమయొక్క అవసరాలను తీర్చగలిగింది.

అయితే 1953 లో, ఇంత విజయవంతమైన పాత్రను ధరించిన గ్రామాలు నగరాలకంటే ఎంతో వెనుకబడి, దేశంలో పెరుగుతున్న ఆవశ్యకతలకనుగుణంగా వ్యవహరించలేకపోవడం గుర్తించబడింది. సోవియట్ ప్రజల జీవనప్రమాణం అధికతరమై, కొనుగోలు శక్తి పెరిగింది. జననసంఖ్య క్రమానుగతికంగా పెరుగుతూ, మరణ సంఖ్య సన్నగిలుతున్నది. వ్యవసాయకోత్పత్తిని అధికం గావించడానికి తీవ్ర చర్యలు తీసుకొనవలసి వచ్చింది. అప్పుడు ఎటువంటి చర్యలు తీసుకొనబడినవి ?

వ్యవసాయపు పన్ను తగ్గించబడినది, సమిష్టి క్షేత్రదారులు ఉత్పత్తిచేసి సరఫరా చేసిన వస్తువులకు ప్రభుత్వ ధరలు పెంచబడినవి. గ్రామాలకు అత్యధికంగా యంత్రాలు సరఫరా చేయబడ్డాయి. ఉదాహరణకు, 1931 నుండి 25 సంవత్సరాలలో గ్రామాలకు 1,375,000 ట్రాక్టర్లు అందజేయబడితే, ఒక్క ఆరవ పంచవర్ష ప్రణాళికా కాలంలోనే వాటికి 1,65,000 ట్రాక్టర్లు (15 అశ్విక శక్తి కలిగిన ట్రాక్టర్లు) అందజేయబడ్డాయి.

కడపట, అనల్పమైన, వ్యవసాయ నిధులు (ఇంతవరకు నాగలి తాకని బీడు భూములనుండి)తరచబడ్డాయి. పూర్వపు రష్యాలో సాగుబడి ప్రాంతాల విస్తీర్ణం 118,000,000 హెక్టార్లే. అంత భూమిని సాగుబడిక్రిందికి తీసుకరావడానికి ప్రజలు శతాబ్దాల తరబడి శ్రమించవలసి వచ్చింది. సోవియట్ ప్రజల కార్యదీక్ష, ఉత్సాహము, వారి అధీనంలో వున్న శక్తివంతమైన యంత్రాలు అభినందనీయమైనవి. 35,000,000 హెక్టర్లకు పైగా (జారు కాలపు రష్యాలోని మొత్తపు సాగుబడి భూమిలో 1 3 వ వంతుకు) భూమి 3 సంవత్సరాలలో, కొత్తగా సాగుబడి క్రిందికి తీసుకరాబడింది.

దీనివల్ల అపూర్వమైన పంటవచ్చింది. అమ్మకానికి విడుదలచెయ్యను 55.000.000 టన్నుల ధాన్యం రావడంతో, ప్రజలయొక్క అవసరాలకు పోను, పెద్ద ఎత్తున దేశం ధాన్యాదుల నిలువచేసుకొన గలిగింది.

పూర్వపు రష్యా సామెత ఒకటి ఉన్నది: "అన్నిటికీ రాజు రొట్టే"నని. ఇప్పుడిక ధాన్యోత్పత్తి ఉన్నత స్థాయికి తీసుకరాబడినది గాబట్టి, సోవియట్ ప్రజలు ఎంతో అభివృద్ధి చెందిన పెట్టుబడి దారీ దేశం, అమెరికాను, పశుపాలి ఉత్పత్తిలో అధిగమించడానికి పూనుకొన్నారు.

1960-61 నాటికి సోవియట్ దేశం, అమెరికాను పాలు, వెన్న ఉత్పత్తిలోనేకాక, ఎందువల్లనంటే ఇది అంతకుముందే అంచనాల అతిక్రమించగలుగుతుంది కాబట్టి, మాంసోత్పాదనలోను అధిగమించడానికి అంచనాలు వేయబడ్డాయి.

1931లో, అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభ కరాచీ సమావేశ తీర్మానంలో, ప్రజలు దోపిడికి గురికాకుండా దోపిడిని అంతమొందించాలంటే, రాజకీయ స్వాతంత్ర్యంలో లక్షలాది క్షుధార్తుల నిజమైన ఆర్థిక స్వాతంత్ర్యం అంతర్గర్భితమై ఉండాలని ఉద్ఘాటించింది.

నిజమైన ఆర్థిక స్వాతంత్ర్యం, పీడననుండి విముక్తి, కార్మిక వర్గాలకు దుర్భరమైన దారుణ నిరుద్యోగ నిర్మూలన, సోవియట్ దేశంలో సాధించబడ్డాయి గాబట్టి, సోవియట్ దేశంలో క్షుధార్తులు లేరు.

ఆకలిని, లేమిని, అస్థిరత్వాన్ని తుడిచిపెట్టి, సోవియట్ ప్రజలు ఆ తరువాత సర్వ సమృద్ధమైన వస్తు, సాంస్కృతిక సంపదల, ప్రతి వ్యక్తియొక్క సకలావసరాలను సిద్ధింపజెయ్యటానికి వీలుగా సృష్టించడానికి కృషి చేస్తున్నారు. ఈ లక్ష్యసాధనకు ఉద్యమించబడినదే మహత్తర అక్టోబరు విప్లవం.

ట్రాన్సు కార్పేతియాలో పంటకోత వేడుకలు



# ప్రపంచాన్ని కదిలించిన పది మహోత్తర దినాలు

*అమెరికన్ పత్రికా రచయిత జాన్ రీడ్ (1887-1920) అక్టోబరు సామ్యవాద విప్లవ చరిత్రాత్మక ఘటనలను కళ్ళారా చూశారు. ఆ ఘటనలను గురించి ఆయన ఒక గ్రంథాన్ని వ్రాశారు.*

## తాత్కాలిక ప్రభుత్వ పతనం*

**జాన్ రీడ్**

బుధవారం, నవంబరు 7. నేను చాలా ఆలస్యంగా లేచాను. నెవ్‌స్కీ గుండా నేను వెళ్తుంటే పీటర్-పాల్‌నుంచి శతఘ్ని గర్జనలు వినిపిస్తున్నాయి. ఆ రోజు చలిగా వుంది. స్టేట్ బ్యాంక్ ఎదుట, బాయ్‌నెట్లు గురిపెట్టి కొందరు సైనికులు మూసివున్న తలుపుల ఎదుట నిలుచున్నారు.

"మీరేపక్షం? ప్రభుత్వపక్షమా?" అని అడిగాను.

"మరి ప్రభుత్వానికి లేదు" అన్నాడతను పండ్లిగిలించి, స్లావా బోగు! దేవుడు కీర్తనీయుడగుగాక!" అన్నాడు. అతనినుండి నేనురాబట్టుకోగలిగింది యింతే.

స్ట్రీట్‌కార్లు నెవ్‌స్కీలో పరుగెత్తుతున్నాయి. స్త్రీలు, పురుషులు, చిన్న పిల్లలూ దొరికినదానినల్లా పట్టుకుని వ్రేలాడుతున్నారు. దుకాణాలు తెరిచివున్నాయి, అంతకుముందురోజు వున్నదానికంటె వీధుల్లోని జనంలో అశాంతి తక్కువగా వున్నట్టుంది.

రబోచి పుత్ (బోల్షివిక్ పార్టీ వార్తా పత్రిక) కొన్నాను. అమ్మకం జరుగుతోన్న వార్తాపత్రిక యిది ఒక్కటేలాగుంది. కాస్సేపటి తరవాత, డియాన్ పాతప్రతికోసం ఒక సైనికునికి 50 కోపెక్కులు చెల్లించాను. రుస్సకయా ఒలియా యొక్క ఆక్రమించుకున్న కార్యాలయంలో పెద్దపెద్ద కాగితాలమీద అచ్చువేయబడిన బోల్షివిక్ పత్రికమీద పెద్ద శీర్షికలున్నాయి: "కార్మిక, సైనిక, కర్షక సోవియట్లకే అధికారమంతా! శాంతి! రొట్టె! భూమి!"

మోర్స్కయా మూలను మెన్షివిక్ ఒబొరొనెత్జ్, తన పార్టీ సైనిక విభాగపు కార్యదర్శి అయిన కేప్టన్ గొంబెర్గ్ ఎదురయ్యాడు. నిజంగా తిరుగుబాటు జరిగిందా అని అతనిని నేనడిగితే, ఆయన భుజాలు ఎగురవేసి జవాబిచ్చాడు. "త్స్చోర్త్ జ్నయెత్! దేవునికే తెలియాలి! బోల్షివిక్కులు బహుశా అధికారాన్ని వశపర్చుకుంటారేమో. కాని మూడురోజులకు పైగా దాన్ని నిలబెట్టుకోలేరు. ప్రభుత్వాన్ని నడపడానికి వాళ్ళకు మనుషులు లేరు. వాళ్ళను ప్రయత్నించడం మంచిదేమో—దాంతో వాళ్ళపని ఆఖరై పోతుంది...."

అడ్మిరాల్తేయస్కీ గుండా మేము వింటర్ భవనం వేపు వెళ్ళాము. భవనపు చౌకుకు వెళ్ళే త్రోవలన్నిటినీ కాపలాభటులు మూసివేశారు. పడమటి చివరను అడ్డంగా సైనికులు కాపలా కాస్తున్నారు. అశాంతితో పౌరులు వారిని చుట్టుముట్టి వున్నారు. భవనం నుంచి ముందు వాకిట్లోకి కలపను మోసుకవచ్చి ముఖద్వారం ఎదుట కుప్పవేస్తున్నట్టుగా కనిపించే దూరానవున్న సైనికులు తప్పితే, అంతా ప్రశాంతంగా వుంది.

ఈ కాపలా సైనికులు ప్రభుత్వపక్షంవారో, సోవియట్ పక్షంవారో మాకు తెలియలేదు. స్మోల్నీనుండి తెచ్చిన మా కాగితాలవల్ల లాభంలేకపోయింది; అందువల్ల మేము ప్రముఖులవలె ఇంకో వేపునుండి వెళ్ళి, మా అమెరికన్ పాస్‌పోర్టులుచూపించాము. "అధికార సంబంధ్య వ్యవహారాలు"న్నాయంటూ. లోపలికి వెళ్ళగలిగాము. భవనద్వారంవద్ద అదే పాత స్వైత్‌జరీ వున్నారు, ఎర్రని, బంగారు కాలర్లుగల బ్రాస్‌గుండీల నీలపు యూనిఫారాలతో; మర్యాదగా వారు మా కోట్లనూ, హాట్లనూ తీసుకున్నారు. మేము మేడమీదికివెళ్ళాము. జాలరులు లేకుండా వున్న వసారా విషాదపు వాతావరణంలోనుండి, చీకట్లో కొద్దిమంది నౌకర్లు తిరుగులాడుతున్నారు. కెరెన్‌స్కీవున్న గదికి ఎదురుగుండా యువకుడైన ఒక అధికారి ముందుకు వెనుకకు పచారీ చేస్తున్నాడు, మీసం మెలిపెడుతూ. మంత్రి-అధ్యక్షుణ్ని దర్శించవచ్చునా అని మేమతనిని అడిగాము. అతను వినమ్రుడై తన జోళ్ళను నేలకు తాకించాడు.

"శీతకాల భవనం స్వాధీనం చేసుకొనుట." ప్రతి చిత్రణ: వి. సెరోవ్.
(సోవియట్ దేశ కళా పరిషత్తు తృతీయ ప్రదర్శన నుండి)



* సంక్షిప్త రచన



"లేదు" అని ఫ్రెంచిలో అతను జబాబు చెప్పాడు. "అలెగ్జాండర్ ఫియొదొరోవిచ్ యిప్పుడు చాలా పని తొందరలోవున్నారు" అతను కాస్సేపు మావేపు చూసి "అసలు సంగతి, ఆయన యిక్కడ లేరు "

"ఎక్కడున్నారు ?"

"ఆయన యుద్ధరంగానికి వెళ్ళారు. ఆయన కారుకు సరిపడా గాసొలైన్ లేదు. కొద్దిగా అప్పుతీసుకరావడానికి, మేము ఇంగ్లీషు ఆసుపత్రికి మనిషిని పంపవలసి వచ్చింది.

"మంత్రులిక్కడ వున్నారా ?"

"వారేదోగదిలో సమావేశమైవున్నారు — ఎక్కడో నాకు తెలియదు."

బోల్షివిక్కులు వస్తున్నారా ?

"అవును, తప్పకుండా, వాళ్ళు వస్తున్నారు. వారు వస్తున్నారని ప్రతినిమిషమూ నాకు టెలిఫోనులో కబురు వస్తోంది. కాని మేము సిద్ధంగానే వున్నాము. భవనానికి ఎదురుగుండా మాకు యంకర్లు న్నారు, ఆ తలుపుతావల."

"మేమక్కడికి వెళ్ళవచ్చునా ?"

"లేదు, వెళ్ళకూడదు. అనుమతిలేదు." హటాత్తుగా అతను అందరితో కరచాలనంచేసి వెళ్ళిపోయాడు. మేము ఆవెళ్ళకూడదన్న తలుపువేపుకు వెళ్ళాము. తాత్కాలికంగా ఒక హాలును విభాగించిన ఒక అడ్డంవుంది, వెలుపలను తాళంవేసివుంది. ఆవలవేపున గొంతుకలు వినిపిస్తున్నాయి, ఎవ్వరో నవ్వుతున్నారు. ఇది తప్పితే యీ పాతభవనపు విశాలమైన ప్రదేశాలు స్మశానశాంతితో నిండివున్నాయి. ముసలి ష్వెయిత్జర్ పరుగెత్తుకువచ్చాడు. "కాదు కాదు, బరిణ్, మీరక్కడికి వెళ్ళకూడదు."

"తలుపు తాళంవేసివున్నదెందుకు ?"

"సైనికులను లోపల వుంచడానికి" అని అతను జబాబు చెప్పాడు. కొద్ది నిమిషాల తరవాత, టీ పుచ్చుకోవడం గురించి ఏదో చెప్పాడు చెప్పి మళ్ళీ హాలువేపుకు వెళ్ళిపోయాడు. మేము తలుపు తెరిచాము.

లోపల యిద్దరు సైనికులు కాపలా కాస్తున్నారు. కాని వాళ్ళేమీ అనలేదు. నడవ చివరను ఒక పెద్ద అలంకృతమైన గది వుంది. దానికి బంగారు మలామాచేసిన చూరులూ, పెద్ద స్ఫటికతో చేయబడిన గాజుకుప్పెలు వున్నాయి. దానికావల చిన్నగదులు చాలా వున్నాయి. వాటికి నల్లని కర్రతాపడం చేసివుంది. నేలకు యిరువేపులా మురికి పక్కల వరుస, దుప్పట్లు పడివున్నాయి. వీటిమీద అప్పుడప్పుడు వచ్చే సైనికులు పడుకుంటారు. ప్రతిచోటా సిగరెట్ల పీకలూ, రొట్టెముక్కలూ, బట్టలూ, ఖరీదైన ఫ్రెంచి లేబుళ్ళుగల ఖాళీ సీసాలూ పడివున్నాయి. యంకర్ పాఠశాలలకు సంబంధించిన ఎర్రని భుజకీర్తులుగల సైనికులు అధిక సంఖ్యలో పొగాకు పొగ, స్నానం చెయ్యని మనుష్యుల వాతావరణంలో తిరుగులాడుతున్నారు. ఒకని దగ్గర తెల్ల బర్గండీ సీసావుంది. ఇది రాజభవనపు నిలవల నుండి సంగ్రహించినదని స్పష్టం. మేము పోతూ వుంటే వాళ్ళు మమ్ములను ఆశ్చర్యంతో చూశారు. ఒక గదినుంచి యింకో గదికి మేము సాగిపోయాము. చివరికి మేము పెద్ద ప్రభుత్వ శకటాల సముదాయం వద్దకు వచ్చాము. వాటి పొడవాటి మురికి కిటికీలు చౌకు వేపుకు వున్నాయి.

ఆ సలంఅంతా పెద్ద సైనికావాసంగా వుంది. దాని నేల, గోడలనుబట్టిచూస్తే కొన్ని వారాలుగా యిది యీ విధంగా వుందని స్పష్టం. మెషీన్‌గన్లు కిటికీలపైకి ఎక్కించ బడ్డాయి. రైఫిళ్ళు పక్కలమధ్య దాచబడ్డాయి.

కాస్సేపు మేము కిటికీవద్ద నిలుచున్నాము, రాజభవనానికి ఎదుటనున్న చౌకువేపు చూస్తూ. ఇక్కడ పొడవాటికోట్లు వేసుకుని వున్న యంకర్ల మూడు కంపెనీలు ఆయుధపాణులై వున్నారు. పొడవుగావున్న చురుకైన ఒక ఉద్యోగి — తాత్కాలిక ప్రభుత్వపు ముఖ్య సైనిక మంత్రి స్టాన్‌కీవిచ్‌గా యీయనను నేను గుర్తించాను — వారి నుద్దేశించి ప్రసంగిస్తున్నాడు. కొద్ది నిమిషాల తరవాత రెండుకంపెనీలు తటాలున ఆయుధాలను భుజాలపైని వేసుకుని, మూడు నినాదాలను అరిచి చౌకుకు మధ్యగా వెళ్ళిపోయారు, రెడ్ ఆర్చ్ గుండా ప్రశాంతమైన నగరంలోనికి అదృశ్యమవుతూ.

"వారు టెలిఫోను ఎక్స్‌ఛేంజ్‌ని పట్టుకోబోతున్నారు" అన్నారొకరు. ముగ్గురు కేడిట్లు మా ప్రక్కను నిలుచున్నారు. మేము సంభాషణలోనికి దిగాము. సైన్యంనుండి తాము పాఠశాలల్లో చేరామని వారు చెప్పారు. కాని యిప్పుడు వారు అధికారులుగా వుందా

మనుకోవడంలేదు, ఇప్పుడు అధికారులంటే ఎవ్వరికీ యిష్టంలేదు గాబట్టి. ఏమి చెయ్యాడమో వారికి తోచినట్టుగా లేదు, వారు సుఖంగా లేరన్నది స్పష్టం.

కాని తొందర్లోనే వారు డంబాలకు దిగారు. "బోల్షివిక్కులు వస్తే ఎలాపోరాడాలో వారికి మేము చూపుతాము, వాళ్ళు పోరాటానికి సాహసించరు, వారు పందలు. కాని మా బలం సన్నగిల్లినట్టయితే, ప్రతిఒక్కడూ తనకోసం ఒక తుపాకీగుండును దాచుకుంటాడు...."

ఈ సమయంలో, దగ్గర్లోనె రైఫిలు కాల్చుతోన్న శబ్దం విని సిస్తోంది. చౌకులో అందరూ పరుగెత్తడం మొదలు పెట్టారు, బొమ్మర్లా పడిపోతున్నారు. ఇజ్వోష్టచికీ మూలల్లోనిలబడి అన్ని వేపులకూ దౌడుతీస్తున్నారు. లోపల అంతా గగ్గోలుగావుంది. సైనికులు అక్కడికీ యిక్కడికీ పరుగెత్తుతున్నారు, తుపాకులు, రైఫిలు బెట్టులు లాక్కుంటున్నారు. "ఇదుగో వాళ్ళు వచ్చారు! ఇదుగో వాళ్ళు వచ్చారు!"....అని కేకలు వేస్తున్నారు. కాని కొద్ది నిమిషాలలో మళ్ళీ అంతా ప్రశాంతమైపోయింది. ఇజ్వోష్టచికీ తిరిగి వచ్చారు, పడుకునివున్నవారు లేచి నిలబడ్డారు. రెడ్ ఆర్చ్ గుండా యుంకర్లు కనిపించారు, వారి నడకలో కాస్త తొట్రుబాటు కనిపిస్తోంది. వారిలో ఒకరిని యిద్దరు సాయంపట్టి తీసుకవస్తున్నారు.

మేము రాజ భవనంనుండి బయలుదేరినప్పటికి ఆలస్యం అవుతోంది. చౌకులోని కావలా సైనికులందరూ అదృశ్యమైపోయారు. పెద్ద అర్ధ చంద్రాకృతిలో వున్న ప్రభుత్వ భవనాలు నిర్మానుష్యంగా కనిపిస్తున్నాయి,

మేము మళ్ళీ మోర్స్కయా వద్దకు వచ్చినప్పుడు చాలా చీకటిగా వుంది, నెవ్‌స్కీ మూలనుగల మిణుకుమిణుకు మంటోన్న వీధి దీపం తప్పితే. దీని దిగువను ఒక పెద్ద సాయుధమైన రేసింగ్ ఇంజిన్‌గల మోటారుకారుంది. నూనె పొగ దానినుండి బయటికి వస్తోంది. ఒక చిన్న కుర్రాడు ఒక ప్రక్కను ఎక్కి మెషీన్‌గన్ బారెల్‌గుండా చూస్తున్నాడు. సైనికులు. నావికులు చుట్టూరా నిలబడ్డారు, వాళ్ళు దేనికోసరమో వేచివున్నట్టుగా వుంది. మేము రెడ్ ఆర్చ్‌వరకూ మళ్ళీ తిరిగి నడిచాము. ఇక్కడ కొంతమంది సైనికులు గుమిగూడి అందంగా దీపాలంకృతమైన వింటర్ భవనం వేపు చూస్తున్నారు, బిగ్గరగా మాటాడుతున్నారు.

"కాదు, కామ్రేడ్స్, వారిపైని మనం ఎలా తుపాకులు కాల్చడం? స్త్రీల సైనికదళం అక్కడ వుంది—మనం రష్యన్ స్త్రీలపైని తుపాకులు కాల్చామని వారంటారు" అని ఒకతను అంటున్నాడు.

మేము మళ్ళీ నెవ్‌స్కీ చేరుతుండగా మరొక సాయుధశకటం మూలనుండి వచ్చింది, ఒకతను ఎగువ భాగంపైనుండి తల ఎత్తాడు.

"రండి!" అంటూ అతను అరిచాడు. "ముందుకు వెళ్ళి దాడి చేద్దాం!"

ఇక్కడ స్ట్రీట్-కార్లు ఆగాయి, కొద్దిమందివెళ్ళారు. దీపాలు లేవు. కొద్దియిళ్ళ కావల మాకు ట్రాములు, గుంపులు, దీపాలు వెలిగించివున్న దుకాణాల కిటికీలు, చలనచిత్ర ప్రదర్శనల విద్యుద్దీప చిహ్నాలు కనిపిస్తున్నాయి - జీవితం మామూలుగా సాగిపోతోంది. మరిన్‌స్కీ నాటకశాలలో నృత్య నాటక ప్రదర్శనానికి మావద్ద టికెట్లున్నాయి. నాటకశాలలన్నీ తెరిచే వస్తున్నాయి. కాని అవల వాతావరణం ఉద్రేకపూరితంగా వుంది.

చీకటిలో, పోలీసు వంతెనకు స్ట్రొగనోవ్ భవనం ఎదుటనున్న కలప కుప్పలమీద మేము పడ్డాము. మూడు అంగుళాల ఫీల్డుగన్‌ను కొందరు సైనికులు అమర్చుతూ వుండడం చూశాము. వివిధ యూనిఫారములు ధరించినవారు, ఏ లక్ష్యమూ లేకుండా వున్నారు, పోతున్నారు, చాలా కబుర్లు చెప్పుకుంటున్నారు....

నెవ్‌స్కీకి ఎగువను నగరంలోని వారందరూ విహారానికి వెళ్ళినట్టుగా వుంది. ప్రతిమూలను పెద్దపెద్ద గుంపులుగాచేరి తీవ్రంగా చర్చిస్తున్నారు. బాయ్‌నెట్లు ఎక్కుపెట్టిన డజను మంది సైనికులుగల కాపలా దళాలు వీధి కూడలులలో వున్నాయి. గొప్ప ఉన్నికోట్లు తొడుక్కునివున్న ఎర్రని ముఖాలుగల వృద్ధులు వారివేపు పిడికిళ్ళు బిగించి ఊపారు. అందంగా అలంకరించుకున్న స్త్రీలు శాపాలు కురిపించారు. సైనికులు నీరసంగా వాదించి సమాధాన పర్చబోయారు. తొలి చక్రవర్తులైన ఒలెగ్, రురిక్, స్వియెతోస్లావ్ పేరిటనున్న వీధుల్లో సాయుధ శకటాలూ ఎగువకూ దిగువకూ తిరుగుతున్నాయి. వాటిమీద "ఆర్. యస్. డి. ఆర్. పి" (రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ లేబర్‌పార్టీ) అన్న పెద్ద ఎర్ర అక్షరాలున్నాయి. మిఖయిల్‌లోవస్కీలో ఒక మనిషి ఒక పెద్ద వార్తాపత్రికల కట్టతో కనిపించాడు. వెంటనే అతనిచుట్టూ ఉద్రిక్తులైన ప్రజలు గుమిగూడారు, ఒక రూబులు, ఐదురూబుళ్ళు, పదిరూబుళ్ళు యిస్తూ జంతువుల్లాగ ఒకరితో ఒకరు పోట్లాడుతూ. అది రబొత్చి ఐ సోల్డట్. అది శ్రామిక వర్గ విప్లవ విజయాన్ని యింకా జైళ్ళలో వున్న బోల్షివిక్కుల విముక్తినీ ప్రకటిస్తోంది, యుద్ధ రంగంలోనూ, యుద్ధ రంగానికి వెనుక వున్న సేనకు బలపర్చమని విజ్ఞప్తి చేస్తూ.. .తీవ్రమైన చిన్న నాలుగు పుటల పత్రిక, పెద్దపెద్ద అక్షరాలలో అచ్చయింది, యింకే వార్తలూ లేవు....

తరవాత, గంభీరమైన నిశ్శబ్దతతో ఊరేగింపు ఊళ్ళో తిరిగి, వింటర్ భవనం దిక్కుగా మళ్ళీ నెవ్‌స్కీవద్దకు వచ్చింది.

ఇక్కడ కటిక చీకటిగా వుంది. అంతా నిశ్చేతనంగా వుంది. దీక్షాబద్ధులైన కావలా సైనికులు, రెడ్‌గార్డులు తప్ప. కజాన్ కెథెడ్రల్ ఎదుట ఒక మూడంగుళాల ఫీల్డు గన్ వీధి మధ్యనుంది. ప్రతి గుమ్మందగ్గర సైనికులు నిలబడి మెల్లమెల్లని గొంతులతో మాటాడుకుంటున్నారు, పోలీసు వంతెనవేపు చూస్తూ ఒక గొంతుక యిలా అంటూవుండడం నేను విన్నాను : "మనం చేసింది తప్పేమో...." మూలల్లో కావలా సైనికులు త్రోవను పోయేవారందరినీ ఆపుతున్నారు. ఈ కావలావారిని చూస్తే చాలా వింతగా వుంటుంది, ఎంచేతనంటే సైనికులకు ఆధిపత్యం వహిస్తున్నది తప్పనిసరిగా ఒక రెడ్‌గార్డ్.... తుపాకీ కాల్పులు ఆగిపోయాయి.

మేము మొరస్కయాకు వచ్చేటప్పటికి ఎవరో యిలా కేక వేస్తున్నారు : "మేము వెళ్ళి వారిని బయటికి తీసుకరావలసిందని యుంకర్లు కబురు పెట్టారు!" ఆజ్ఞలు జారీచేస్తోన్న గొంతుకలు వినిపిస్తున్నాయి. ఆ కటిక చీకటిలో ఏదో ఒకగుంపు ముందుకు వెళ్తూ వుండడం మాకు కనిపించింది; అడుగుల చప్పుడూ, ఆయుధాల చప్పుడూ తప్పితే అది నిశ్శబ్దంగా సాగిపోతోంది. మేము ప్రధమ శ్రేణులలో చేరిపోయాము.

నల్లని నదిలాగా, వీధినంతటినీ నింపివేస్తూ, పాటగాని, కులాసా

కేకగాని లేకుండా మేము రెడ్‌ఆర్చ్‌గుండా ప్రవహించాము. నాకు సరిగ్గా ముందరనున్న వ్యక్తి మెల్లగా యిలా అన్నాడు: "చూడండి కామ్రేడ్స్! వాళ్ళని నమ్మకండి. వాళ్ళు తప్పకుండా తుపాకులు కాల్చుతారు!" ఆరు బయట మేము పరుగెత్తడం ప్రారంభించాము. గుంపులు గుంపులుగా చేరి అలెగ్జాండర్ కోలం వేదికకు వెనుకను హటాత్తుగా కిక్కిరిసిపోయాం.

"మీరెంతమందిని చంపారు?" అని నేను అడిగాను.

"నాకు తెలియదు. సుమారు పదిమందిని...."

కొంత సేపు అక్కడ వున్నాక, కొన్ని వందలమంది సేనకు మళ్ళీ విశ్వాసం ఏర్పడినట్టుగా వుంది, ఏ ఆజ్ఞలూ లేకుండా హటాత్తుగా ముందుకు వెళ్ళడం మొదలుపెట్టారు. ఈ సరికి, వింటర్ భవనం కిటికీలగుండా వచ్చిన వెలుగులో, మొదటి రెండు మూడు వందలమంది రెడ్‌గార్డులనీ, వారితో కొద్దిమంది చెల్లాచెదరైన సైనికులున్నారనీ చూడగలిగాను. ఏటవాలు చెరువుతో ఏర్పరిచిన నిరోధం పైగా ప్రాకి మేము లోపలికిగంతి విజయనినాదం చేశాము, అక్కడ నిలబడివున్న యంకర్లు పారవేసివున్న రైఫిళ్ళ కుప్పమీద కూలబడుతూ. ముఖ్య ద్వారానికి రెండువేపులా తలుపులు దారుగా తెరిచి వున్నాయి, వెలుతురు బయటికి వస్తున్నది; ఆ పెద్ద కుప్పనుండి చీమ చిటుక్కుమన్న చప్పుడుకూడా రాలేదు.

ఆతృతతో వున్న మానవతరంగంతో బాటు మేము కుడివేపు ద్వారంలోనికి తుడుచుకపోయాము. ఇది విలువంపుగా కట్టిన పెద్ద గదిలోనికి తెరుచుకుని వుంది. ఇది తూర్పుపక్షపు సెల్లర్. దీనినుండి చాలా నడవలూ, మెట్లు మొదలవుతాయి. అక్కడ చాలా పెద్ద ప్యాకేజ్ పెట్టెలు వున్నాయి. వీటిమీద పడ్డారు రెడ్‌గార్డులు, సైనికులు కోపంతో, తమ రైఫిళ్ళ మడమలతో బాది విడగొట్టుతూ, వాటి నుండి తివాసీలనూ, తెరలనూ, బట్టలనూ, పోర్సిలిన్ పళ్ళాలనూ, గాజు సామాన్లనూ బయటికి లాగుతూ.... ఒకడు చుట్టూరా తిరుగుతున్నాడు ఒక కంచు గడియారాన్ని భుజంమీద పెట్టుకుని. ఇంకొకనికి నిప్పుకోడి వెంట్రుకలు కనిపించాయి; వాటినతను తన టోపీకి తగిలించుకున్నాడు. ఎవరో అరిచారు—"కామ్రేడ్! ఏదీ ముట్టకండి! ఏదీ తియ్యకండి! ఇది ప్రజల సొత్తు!" వెంటనే యిరవై గొంతులు కేకేస్తున్నాయి, "ఆగండి! మళ్ళీ అన్నీ పెట్టెయ్యండి! ఏదీ తియ్యకండి! ప్రజలసొత్తు!" మోటుగా, తొందరగా ఆ వస్తువులు మళ్ళీ ఆ పెట్టెల్లోకి యెక్కించబడ్డాయి. తమకు తామే నియమించుకుని సైనికులు కాపలా కాశారు. ఇదంతా పూర్తిగా దానంతటదే జరిగిపోయింది. నడవలగుండా, మెట్లమీదుగా కేకలు మందమవుతూ వినిపిస్తున్నాయి—"విప్లవ క్రమశిక్షణ! ప్రజల సొత్తు!...."

యంకర్లు వచ్చారు, ముగ్గురు, నలుగురు మురాలుగా. విపరీతమైన పట్టుదలతో వారిని కమిటీ పట్టుకుంది. వారిని తనిఖీచేసి "ఓ, వీళ్ళు రెచ్చగొట్టేవాళ్ళు! కోర్నిలోవిస్టులు! విప్లవ శత్రువులు! ప్రజాహంతకులు!" కాని హింస యేమీ జరగలేదు. యంకర్లు హడలెత్తి వున్నప్పటికీ. వారికికూడా జేబులనిండా దోచిన చిన్నచిన్న వస్తువులున్నాయి. దీనిని వ్రాయసకాడు జాగ్రత్తగా వ్రాసుకున్నాడు, చిన్న గదిలో కుప్ప వేయబడ్డాయి.... యంకర్ల ఆయుధాలు తీసివేయబడ్డాయి. "ఇక, మళ్ళీ ఎప్పుడైనా మీరు ప్రజలకు వ్యతిరేకంగా ఆయుధాలను చేపడతారు?" అంటూ కేకలు వేశాయి గొంతుకలు.

"చేపట్టము" అంటూ జబాబు చెప్పారు యంకర్లు, ఒకరి వెంబడిని ఒకరు. దానిమీదట వారిని స్వేచ్ఛగా వెళ్ళిపోనిచ్చారు.

మేము లోపలకు వెళ్ళవచ్చునా అని అడిగాము. కమిటీ సందేహిస్తున్నది. కాని పెద్ద రెడ్‌గార్డ్ కచ్చితంగా చెప్పేశాడు వీలు కాదని. "అయితే మీరెవరు?" అని అడిగాడు "మీరంతా కెరెన్‌స్కీ కుటుంబీకులు కారని నాకేమిటి హామీ?" (మేము ఐదుగురం, ఇద్దరు స్త్రీలు).

"పజల్‌స్త, తొవరిషీ! త్రోవ యివ్వండి, కామ్రేడ్స్!" ఒక సైనికుడు, ఒక రెడ్‌గార్డ్ ద్వారంవద్ద కనిపించారు. గుంపును ప్రక్కకు తొలగమని చేయి ఊపుతూ. ఇతర గార్డులు బోయనెట్లు ఎక్కుపెట్టి వున్నారు. వారి తరవాత పౌరదుస్తుల వేసుకునివున్న ఆరుగురు ఒకరివెంబడిని ఒకరు వెళ్ళారు వీరు తాత్కాలిక ప్రభుత్వ సభ్యులు. మొదటి కిష్కిన్ వచ్చాడు, అతనిముఖం పాలిపోయి వ్రేలాడివుంది. తరవాత రుతెన్‌బర్గ్, విచారంగా నేలవంక చూస్తున్నాడు. తరవాత తెరెశ్చెంకో, తీవ్రంగా చుట్టూరా చూస్తున్నాడు; ఈయన మా వేపు నిశ్చలంగా చూశాడు.. వాళ్ళు నిశ్శబ్దంగా వెళ్ళిపోయారు. విజయాన్ని చేపట్టిన తిరుగుబాటుదారులు చూడడానికి గుమిగూడారు. కాని కొద్దిమంది మాత్రమే కోపంగా గొణుక్కున్నారు. తరవాతను మాత్రమే మాకు తెలిసింది. ప్రజలు వారిని వీధిలో చంపాలనుకున్నారని, తుపాకులు పేల్చారని—కాని నావికులు వారిని క్షేమంగా పీటర్-పాల్‌కు తీసుకవచ్చారనీ ...

మేము ఆ చల్లని, భయంకర రాత్రి వేళ బయటికి వచ్చాము. ఏవో సేనలు కదులులాడుతున్నాయి, కాపలాలు కాస్తున్నారు. నదికావల, పీటర్‌పాల్ కట్టడం నల్లగా కానవస్తున్నచోట, ఒక కీచుగొంతుక కేక వినిపించింది. కాళ్ళక్రిందను కాలిబాటపైని పగిలిన గచ్చుపడివుంది, రాజభవనపు బోదెది. యుద్ధనౌక అరోరా గుళ్లు తగిలిపడిందిది. కాల్పులవల్ల జరిగిన నష్టం యిదొక్కటే....

ఇప్పుడు ఉదయం మూడు దాటిపోయింది. నెవెస్కీలో మళ్ళీ వీధిదీపాలన్నీ వెలుగుతున్నాయి. శతఘ్ని పోయింది. యుద్ధచిహ్నమల్లా మంటలచుట్టూ కూచున్న రెడ్ గార్డులు, సైనికులూ. నగరం ప్రశాంతంగా వుంది—బహుశా, దాని చరిత్రలో యింత ప్రశాంతంగా అదెన్నడూ లేదేమో. ఆ రాత్రి ఒక్క బందిపోటు జరగలేదు, ఒక్క దొంగతనమూ జరగలేదు.

---

## యదార్థాలూ, సంఖ్యలూ

శ్రామిక ప్రజలకు చెందిన స్థానిక సోవియట్లలో, సోవియట్ మహిళలలో అయిదు లక్షల మందికి పైగా సభ్యత్వం కలిగివున్నారు. సోవియట్ సమాఖ్యలోని, స్వయంపరిపాలక రిపబ్లిక్కులలోని సుప్రీం సోవియట్లలో 2,209 మంది మహిళలకు సభ్యత్వం ఉన్నది. సోవియట్ దేశ సుప్రీం సోవియట్, 348 మంది మహిళా సభ్యుల కలిగి ఉన్నది.

* * *

సోవియట్ దేశ ప్రభుత్వంలోనూ, యూనియన్ రిపబ్లిక్కుల ప్రభుత్వాలలోనూ, 103 మంది సోవియట్ మహిళలు మంత్రివర్గాల ఉపాధ్యక్షురాండ్రుగనూ, మంత్రిణులు, ఉపమంత్రిణులుగానూ ఉన్నారు.

---

# ప్రజలకు దూరమైన బాధ

ఎల్. ల్యూబిమోవ్

అక్టోబరు సోషలిస్టు విప్లవాన్నేగాక, ఫిబ్రవరి బూర్జువా విప్లవాన్నిగూడా నిరసించిన రష్యన్ సమాజపు పూర్వకాలపు వర్గంలో పుట్టి పెరిగినవాడిని నేను. మా తండ్రి రాజ దర్బారులో గొప్ప హోదాను కలిగి వుండేవారు జారు తరఫున రష్యన్ సామ్రాజ్యంలోని సువిశాల ప్రాంతాలను పరిపాలిస్తూ ముఖ్యమైన ఉద్యోగాలను ఆయన నిర్వహించారు. మా బంధువుల్లో అనేకులు (తండ్రి తరఫువారు, తల్లి తరఫువారు) గూడా రాజ దర్బారులో గొప్ప పదవుల్లో వుండేవారు. అంతా ఉన్నత పరిపాలక వర్గానికి చెందినవాళ్ళము. కులీన వంశస్థులకొరకు ప్రత్యేకంగా నడుపబడుతూ వుండిన ఒక పాఠశాలలో నా విద్యాభ్యాసం జరిగింది. మేమంతా "పాలక వర్గా"నికి చెందినవారమనీ యావత్తు రష్యాను పరిపాలిస్తామనీ ఆ విద్యాసంస్థ మాకు నూరిపోసేది.



ఎల్. ల్యుబిమోవ్

యౌవనదశలో ప్రపంచంపట్ల నా భావాలు యెలా రూపొందాయి, విప్లవంపట్ల నా వైఖరి యెలాగుండేది అన్న విషయాలు తెలియజేయడానికి ఇది చాలనుకుంటాను.

1919 లో నేను 16 సంవత్సరాలవాడనై యుండగా నా తలిదండ్రులూ, నేను విదేశానికి వలసపోయాము. అక్కడ నేను దాదాపు ముప్ఫై సంవత్సరాలపాటు మా వర్గానికి చెందినవారి మధ్యనే నివసిస్తూ, విప్లవాన్ని ద్వేషించసాగాను. మా దేశంలో ఏర్పడిన సాంఘిక వ్యవస్థ తాత్కాలికమైనదేననీ, త్వరలో అంతరించి పోతుందనీ ఆశిస్తూ వచ్చాను.

ఇలాంటి భావాలతో యెంతోకాలం వుంటూ వచ్చినప్పటికీ, చివరికి దేశానికి తిరిగి వచ్చాను. విప్లవాన్ని అంగీకరించాను. అది నా దేశ ప్రజలకేగాక, యావత్తు మానవాళికి కలుజేస్తున్న మహత్తర లాభాన్ని గుర్తించాను.

అటువంటిది యెలా సంభవమయింది ?

సరిగ్గా అదే విషయాన్ని నేనిప్పుడు చెప్పదలచుకున్నాను. ఎందువల్లనంటే, నాతో వచ్చిన యీ పరిణామం నా ఒక్కని భవిష్యత్తుకు సంబంధించిన విశిష్టలక్షణం మాత్రమే కాదు. నాలాగనే తమ ప్రజలనుండి కొంతకాలంపాటు దూరమైపోయిన అనేకవేల రష్యన్ల కథకూడా యిదే.

విదేశాలలో గడిపిన జీవితంతోను, అక్కడ చేసిన పనితోను నేను నిజంగా సంతృప్తిని పొందానని చెప్పలేను. నావలెనే తన మాతృదేశానికి దూరమైపోయి, ప్యారిస్‌లో స్థిరపడిన గొప్ప రష్యన్ గాయకుడు ఫియోదర్ షల్యాపిన్ తరుచు ఇలా అంటుండేవారు: "రష్యన్‌ను, రష్యన్ కళాకారుడిని అయిన నేను, ఒక విదేశంలో బ్రతుకుతూ, ఎందుకు పాటలు పాడాలో నాకర్థం కావడంలేదు. ఫ్రెంచి వారు ఎంతటి సూక్ష్మబుద్ధి కలవారైనప్పటికి నన్ను సంపూర్ణంగా అర్థం చేసుకొనలేరు." వలసపోయిన రష్యన్లు అనేకులు యిలాంటి భావాలనే కలిగి వుండేవారని నేను చెప్పగలను. మేమంతా మమ్మల్ని "విప్లవ బాధితులు"గా భావించుకొనేవాళ్ళము. విప్లవభూతం అంటే భయకంపితులవుతూ వుండిన ఫ్రెంచి బూర్జువా వర్గం మాపై సానుభూతిని చూపుతుండేది. అయినప్పటికి వారి వైఖరిలో ఒక విధమైన అహంభావం కనబడుతూనే వుండేది. మమ్మల్ని "దీన బంధువులు"గా పరిగణిస్తూ, సానుభూతిని ప్రకటించడమే తప్ప వారేమీ చేసేవారుకాదు. ఒక్కొక్క సంవత్సరమే గడుస్తున్న కొద్దీ నన్ను నేనిలా ప్రశ్నించుకొంటుండేవాడిని: ఒక మహాదేశపు పుత్రుడనైన నేను, ఒక పరాయి దేశంలో—అది యెంతటి సుందరమైనదీ, ఆదరణగలదీ అయినా సరే—యెందుకు దీన బంధువుగా జీవించాలి ?

మా కాందిశీకులలో కొందరు, ఫ్రెంచివారు తమతో సమాన గౌరవాన్నిస్తారన్న ఆశతో తమ జాతీయతను విస్మరించి ఫ్రెంచి వారిలో కలిసిపోవడానికి ప్రయత్నించారు. కాని, అలాంటి ప్రయత్నాలు, మొదటి తరం వారిలో యేమంత విజయవంతం కాలేదు. ఫ్రెంచి పౌరసత్వాన్ని పొందిన రష్యన్ కాందిశీకుడు రెండవ రకం ఫ్రెంచివానిగా పరిగణింపబడుతూ వుండేవాడు.

కాని నేను మాత్రం, జాతీయతను విస్మరించడానికి ఏమాత్రమూ అంగీకరించక, రష్యన్లమని చెప్పుకోడానికి గర్వపడుతూ, దేశానికి దూరమైనప్పటికి విదేశీయులతో కలిసిపోవడానికి అంగీకరించని రష్యన్ కాందిశీకుల్లో ఒకడుగా వుంటుండేవాడిని.

అంత్యంవరకు కాందిశీకునిగానే జీవితం గడుపుతూ వచ్చినప్పటికీ షల్యాపిన్ స్వదేశంకొరకు తపిస్తూ ప్యారిస్‌లో ప్రాణాలు విడిచాడు. ప్రఖ్యాత రచయిత అలెగ్జాండర్ కుప్రిన్ యుద్ధానికి కొన్ని సంవత్సరాల ముందు తన మిత్రులతో యిలా అన్నారు: "ఇక నేను భరించలేను. వేరే మార్గమేది లేకపోయిందంటే రైల్వేలైను వెంబడి నడిచిపోయి అలా మాస్కోకు చేరుకొంటాను!" ఆయన చివరికి స్వదేశానికి చేరుకొని, తన ప్రజల మధ్య మరణించి, తన రచనలను వారికి సంక్రమింప జేశాడు.

కాందిశీకులలోని వ్యక్తులు చాలా మంది స్వదేశానికి పోవడానికి యిలా ఆరాటపడుతూ వుండినప్పటికీ, ఈ భావం, ఒక్క రష్యా భవిష్యత్తే గాక యావత్తు మానవాళి భవితవ్యం యేమవుతుందన్న భయాన్ని కల్పించిన రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అధిక సంఖ్యాకుల్లో ప్రాబల్యాన్ని పొందసాగింది.

1941 డిసెంబరు మాసపు ఆనాటి రాత్రి నాకు ఇంకా బాగా గుర్తున్నది! ఎక్కడా ఒక్క దీపమున్నా కనబడడం లేదు. వీధులన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. గదిలో కూడా. రేడియో డయల్‌నుండి కనబడే వెలుగుతప్ప మరేవెలుగూ లేదు: "ఇది మాస్కో రేడియో! మాస్కో రేడియో చెబుతోంది!" గదిలో వున్నవాళ్ళమందరం ఆదుర్దాగా వినసాగాము. బిగ్గరగా వినబడసాగింది. పొరుగువాళ్ళుగాని, వీధివెంట పోయేవాళ్ళుగాని ఆ భాషను, ఆ సంగతులను వింటారేమోనన్న భయం మాకు కలిగింది. ధ్వనిని తగ్గించివేశాము. కాని సంగతులను యెంతో జాగ్రత్తగా వినసాగాము. ఏమివార్తలొస్తాయి? దూరానవున్న మా స్వదేశంనుండి యేమి వింటాము?

అది మాస్కో యుద్ధం జరుగుతున్న సమయం. ఫాసిస్టు పత్రికలూ, రేడియో ప్రసారాలు సంపూర్ణ విజయం తమదేనని డంబాలు కొట్టుకొంటూ, సోవియట్ దేశ పతనాన్ని గురించి జోస్యం చెబుతున్నాయి. కాని, అక్కడినుండి వినవస్తున్న వార్తల్లో, వాటిని చెబుతున్న ధోరణిలోనే, విజయం ద్యోతక మవుతున్నది. ఎలాంటి ఆందోళన లేకుండా అంత నిబ్బరంగా సోవియట్ దేశ భవిష్యత్తును గురించి చెబుతున్నారంటే, అది తప్పక కాపాడబడుతుంది. మేము ప్యారిస్‌లో రహస్యంగా, భయంతో మాస్కోవాణిని వింటూ, నిస్సహాయులమై ఆ గదిలో కూర్చొని వున్నాము. అయినప్పటికి మా హృదయాలు మాత్రం అక్కడ అనేక శ్రమలకోర్చి శత్రువులతో పోరాడుతున్న వారిదగ్గర ఉన్నాయి.

ఆరోజుల్లో నా భావాలు అలాగుండేవి. వాటినెన్నటికీ మరచిపోలేను. ఎందువల్లనంటే మానవునిలోని మంచి గుణాలు అప్పుడే నాలో పైకివచ్చాయి.

సరిగ్గా ఆ రోజుల్లోనే నేను నా మనస్సు యెక్కడున్నది, నా హృదయం యెవరి విజయంకొరకు పరితపిస్తున్నది అన్న విషయాలను తెలుసుకొన్నాను. గతమంతా యెలాగున్నా, కొన్ని దశాబ్దాలపాటు విప్లవాన్ని వైరభావంతో చూచినా, అదే విప్లవంనుండి ఉద్భవించి, స్వాతంత్ర్య పతాకాన్ని క్రిందపడనివ్వకుండా కాపాడుతూ పోరాడుతున్న రష్యాయొక్క విజయానికి నా హృదయం ఆరాటపడసాగింది.

మా మధ్య ఉన్న అడ్డు తొలిగిపోయిందనిపించింది నాకు. నాలాగనే, విదేశాలలో ఉంటున్న రష్యన్లు, తమ స్వదేశం అత్యంత ప్రమాదకర పరిస్థితి నెదుర్కొంటున్న సమయంలో శత్రుపక్షంలో ఒకరుగా ఉండజాలమని గ్రహించారు.

ఫ్రాన్సులోని ప్రతిఘటనోద్యమంలో రష్యన్ కాందిశీకులు గొప్ప పాత్రను వహించారు.

ఒకప్పుడు కులీనవర్గాల్లో పుట్టి పెరిగిన ఒక రష్యన్ యువతి, యువరాణి ఒబొలెన్స్కయా, అందగత్తె. అందరితో స్నేహభావంతో మెలగుతుంది. అయినప్పటికి ఆమెను ఆ గడ్డుదినాల్లో ప్యారిస్ సమాజం ఆకర్షించలేకపోయింది. అజ్ఞాతవాసంలోకి పోయి, నాజీ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా వీరోచితంగా పోరాడింది. చివరికి పట్టుబడి, మరణదండన విధింపబడింది. ఏమాత్రము చలించకుండా తనకు విధింపబడిన శిక్షనుగురించి విన్నది. క్షమార్పణకొరకు వేడుకొమ్మని చెప్పినప్పుడు ఆమె యిలా జవాబు చెప్పింది: "క్షమింపమని నేను ఫాసిస్టులను కోరను." శిరచ్ఛేదనం చేయబడింది. దేశం విముక్తి గావింపబడిన తర్వాత, ఫ్రెంచి ప్రభుత్వం ఆమెపేరట సమర బిరుదులలోని అత్యున్నత బిరుదును ప్రకటించి గౌరవించింది.

ఫ్రాన్సులోని రష్యన్ కాందిశీకులు "రష్యన్ దేశభక్తుడు" అన్న ఒక రహస్య సంస్థను స్థాపించారు. ఆ సంస్థకు సంత వార్తాపత్రిక ఒకటుండేది. సోవియట్ సమాచార శాఖ వార్తలను, దేశభక్తి ప్రబోధక వ్యాసాలను, ప్రకటనలను అది ప్రకటిస్తూ ఉండేది. తప్పించుకువచ్చిన సోవియట్ యుద్ధ ఖైదీలకు రక్షణ ఇవ్వబడుతూ ఉండేది. వాళ్ళనందర్నీ కలిపి కొత్త సాయుధ ప్రతిఘటనా దళాలను సిద్ధం చేస్తుండేది.

ఈ దేశాభిమాన పూరితోద్యమం, పరిస్థితుల వత్తిడి మూలంగా ప్రవాసం రావలసివచ్చిన వారిలో ప్రధానంగా విస్తరించింది! ఒకప్పుడు విప్లవ ప్రతిఘాతక శక్తులచేత సైన్యంలోకి చేర్చుకొనబడి, తర్వాత విదేశాలకు తరలింపబడ్డ రైతులు, కోసక్కులూ ఆలాంటివారు. అందులో చాలామంది ఫ్రాన్సులోని వివిధ వ్యవసాయ క్షేత్రాల్లో పనిచేస్తూవుండేవారు. త్వరలోనే యీ సామాన్యపు రష్యన్లకూ, ఫాసిస్టుల నిర్బంధంనుండి తప్పించుకు బయటపడిన రష్యన్ సైనికులకు మధ్య సుహృద్భావ పూరిత సంబంధాలేర్పడ్డాయి. వారిద్దరికీ వారి దేశం యొక్క వాణి సరియైన మార్గాన్ని చూపసాగింది. కొన్ని రష్యన్ కార్మికకుటుంబాలు చిన్న పొలాలను కౌలుకు తీసుకొని సేద్యం చేస్తుండేవి. ఆ కుటుంబాలలోని పురుషులందరూ గెరిల్లా దళాలలో చేరి, సోవియట్ ప్రజలతోపాటు శత్రువుకు వ్యతిరేకంగా పోరాడసాగారు. వీరిలో ఫ్రాన్సులోనే పుట్టిన రష్యన్ యువకులెందరో ఉన్నారు. కనీసం రష్యన్ భాష మాట్లాడడమైనా తెలియదు వాళ్ళకు. అయినప్పటికి తాము యెన్నడూ చూడనైనా చూడని స్వదేశం కొరకు రష్యన్ ఉపదళాలలో పోరాడారు.

## యదార్థాలూ, సంఖ్యలూ

దేశ మొత్తాన ప్రత్యేక ప్రావీణ్యతలు కలిగిన ఉన్నత విద్యావంతులలో, 56 ప్రతిశతి మహిళలు ఆక్రమిస్తున్నారు. వీరిలో 1,164,000 మంది సెకండరీ పాఠశాలలో ఉపాధ్యాయినులుగా, 265,000 మంది వైద్యురాండ్రుగా, దాదాపు అయిదు లక్షల మంది దేశీయ పరిశ్రమలో ఇంజనీర్లుగా, సాంకేతిక నిపుణురాండ్రుగా నియుక్తమై ఉన్నారు.

* * *

డెబ్బై ఏడువేల అయిదు వందల మహిళలు పరిశోధకురాండ్రు. సోవియట్ దేశ శాస్త్ర విజ్ఞాన పరిషత్తుకు చెందిన శాస్త్ర పరిశోధకులలో 5 795 మంది మహిళలు, 42.3 ప్రతిశతిలో వున్నారు. వీరిలో ఇద్దరు శాస్త్ర విజ్ఞాన పరిషత్తు సభ్యులు. 11 మందికి శాస్త్ర విజ్ఞాన పరిషత్తులో కరస్పాండింగ్ సభ్యత్వం ఉన్నది. 141 మంది డాక్టర్స్ ఆఫ్ సైన్సెస్. 2,127 మంది మాస్టర్స్ ఆఫ్ సైన్సెస్‌లలోను పట్టభద్రత నందారు. 100 మందికి పైగా మహిళలు వివిధ సంస్థలకు, పరిశోధనాలయాలకు ఆధిపత్యం వహిస్తున్నారు. 19,000కు పైగా మహిళలు, శాస్త్ర పట్టాలను, బిరుదులను కలిగి వున్నారు.

తమ స్వదేశమైన సోవియట్ దేశాన్ని పరిరక్షించుకోడానికి ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడుతూ ఫ్రెంచి భూమిపైన రక్తం చిందించిన వారిలో సామాన్య కాందిశీకులేగాక, పూర్వపు రష్యా సమాజంలోని కులీనవర్గాలకు చెందినవారు గూడా ఉన్నారు.

"ఏమైతేనేం, ఎంతైతేనేం,
మార్గాలూ, మన వయస్సులూ;
కన్నీళ్ళు తుడుచుకొంటూ,
గర్వంతో దేశపటం చూచి
మనను కలిపే భక్తి దేశాభిమాన
బంధాలను తెలుసుకొంటున్న
మనమంతా ఒకటే,
దేశం ఆపద సమయంలో."

మాలో అనేకమంది నిజంగా పునర్జన్మను పొందిన, యీ కాలాన్ని చిత్రిస్తూ కాందిశీకులలోని ఒక కవి పైవిధంగా గానంచేశాడు.

తమ దేశం ప్రమాదాన్నెదురుకొంటున్న సమయంలో, దాని రాజకీయ, సాంఘిక వ్యవస్థపట్ల తమవైఖరి యెట్లాంటిదైనసరే, దానితో ప్రమేయం లేకుండా, అంతా స్వదేశ రక్షణకొరకు ఏకం గావాలన్న భావంతో యీ పునర్జన్మ ప్రారంభమయింది. కాని, మా మనస్సుల్లోకి క్రమంగా మరొక భావం చొరుమకొని పోయింది: అంతకు పూర్వం అభేద్యమైనదిగా భావింపబడుతూవచ్చిన జర్మన్ సైన్యానికి చావుదెబ్బ కొడుతున్న రష్యా ప్రజలు, ప్రపంచంలో ప్రప్రథమంగా తాము స్థాపించిన ఒక మహదాశయంనుండే ఆసక్తినీ, కృతనిశ్చయాన్నీ, మనోనిబ్బరాన్నీ పొందుతున్నారు: సోవియట్ ప్రజలు తమ దేశాన్నీ, గృహాలను, ప్రాణాల రక్షణకే గాకుండా మానవాళికి పునర్జన్మను కల్పిస్తున్న ఒక మహదాశయాన్ని కాపాడడానికి గూడా పోరాడుతున్నారని, విప్లవంపట్ల వైరభావంతో దేశాన్ని వదిలిపోయిన మాలాంటి వేలాది కాందిశీకులు గ్రహించసాగారు.

ఈ భావాలతోనే కాందిశీకులు గెరిల్లాదళాల్లో చేరారు. సోవియట్ ప్రజలు, ఫ్రెంచి దేశభక్తులతో భుజం భుజం కలిపి పోరాడుతూ మహత్తర త్యాగాలను చేశారు.

విజయానంతరం, ప్రాణాంతక యుద్ధస్థానంలో "ప్రచ్ఛన్న" యుద్ధం ప్రారంభింపబడి, నూతన దుష్టశక్తులు సోవియట్ దేశానికి అణుయుద్ధ ప్రమాదాన్ని కల్పించినప్పుడు, రష్యా కాందిశీకులలోని ఉత్తమ వర్గాలు తమ దేశంయొక్క శాంతి విధానాన్ని బలపర్చసాగాయి.

సోషలిస్టు ప్రపంచానికీ, వినాశనానికి సిద్ధంగావున్న దురాశను వీడని సామ్రాజ్యవాద ప్రపంచానికీ మధ్యగల యీ విభేదాల్లో సత్యమెట్లున్నదో మాకు తెలియకపోలేదు.

"న్యాయమైనా, అన్యాయమైనా నాదేశందే సరైనమార్గం!" అన్న దురభిమానం, ఇతరదేశాలను కొల్లగొట్టే పలసపెత్తందారీ యుద్ధాలను పురికొల్పడానికి అనేకులకు తోడ్పడింది. కాని, మాస్కో, స్టాలిన్‌గ్రాడ్ యుద్ధాల తర్వాత మాకు దీనిలోని బూటకం తెలిసిపోయింది. మా దేశ ప్రజలు అత్యంతాధునిక సాంఘిక భావాలను ముందుకు తీసుకొని పోతున్నారు, ప్రపంచ మంతటా న్యాయం కొరకు పోరాడుతున్నారు, వారి ఆదర్శం అణుశాంబుకంటే శక్తివంతమైనది అన్న విషయాలే మాకు మార్గదర్శకాలయ్యాయి. సోవియట్ కవి అలెక్సీ సుర్కోవ్ ఒకసారి ఇలా అన్నారు:

"యురేనియం యెంతుంటేనేమి,
చరిత్రవెల్లువను అరికట్టలేనది."

బయటనున్న రష్యన్ కాందిశీకులు తిరిగి తమ సోవియట్ పౌరసత్వాన్ని పొందవచ్చునంటూ 1946లో సోవియట్ ప్రభుత్వం ప్రకటించినప్పుడు ఒక్క ఫ్రాన్సునుండే అనేక వేలమంది కాందిశీకులు తమ దేశానికి తిరిగివచ్చారు. అంతేకాదు. అలా తిరిగి వచ్చిన సోవియట్ పౌరులలో ఒకప్పుడు నూతనసోవియట్ రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా ఆయుధాలను తీసుకొని పోరాడినవారుగూడా ఉన్నారు.

"చివరికి గాలి దాని సరియైన మార్గంలో వీచసాగింది!" ఫ్రాన్సు, చైనా, తదితర దేశాలలో వున్న వేలాది కాందిశీకుల వలెనే నేనుగూడా 1948 కల్లా నా స్వదేశానికి చేరుకొన్నాను. ఈ విధంగా మా సుదీర్ఘ ప్రవాసం అంతమయింది. యౌవనులుగా వెళ్ళినవాళ్ళు పండిన జుత్తుతో తిరిగివచ్చారు. వయస్సు మళ్ళినవారు నడుము వంగిపోయిన ముదుసలులుగా తిరిగివచ్చారు. కాని, అసలు రాకపోవడంకంటే ఆలస్యంగా రావడమైనా మేలే. ఆత్మ దౌర్బల్యం వల్ల, మనస్సు, హృదయం నూతన పరిస్థితులకు అనువుగా మారకపోవడంవల్ల తమదేశానికి తిరిగిరాక, స్వదేశానికి తిరిగి వచ్చే మహదానందాన్ని పొందలేక పోతున్నవారిని చూస్తుంటే నాకు యెంతో విచారం కలుగుతున్నది.

## యుద్ధాలూ, సంఖ్యలూ

మాస్కో సోవియట్ కళాకారుల సంఘంలో, 1,400 మంది కళాకారిణులున్నారు. సోవియట్ దేశ వాస్తు శిల్పుల సంఘంలో 1,160 మంది మహిళలు సభ్యురాండ్రు. 3,800 సభ్యత్వం కలిగిన సోవియట్ రచయితల సంఘంలో, 486 సభ్యత్వ సంఖ్య మహిళలది.

* * *

సోవియట్ దేశ కళాశాలల, ప్రత్యేక సెకండరీ పాఠశాలల అధ్యయనం చేస్తున్నవారిలో సగానికి పైగా మహిళలున్నారు.

* * *

1956లో సోవియట్ దేశం. 200,000 పాఠశాలలను, విప్లవానికి పూర్వపు పాఠశాల సంఖ్యకు 17 రెట్లు అధికంగా కలిగివున్నదని ఘనంగా చెప్పుకొన్నది. రమారమి 18,800 పాఠశాలలు, 1933-1937 మధ్యకాలంలో *దేశ మొత్తాన నెలకొల్పబడ్డాయి, జారుకాలపు* రష్యాకు ఇన్ని పాఠశాలల నెలకొల్పను రెండు శతాబ్దాలు పట్టేది. ఇప్పుడు ఏటేటా 19,000 పాఠశాలలు నిర్మితమవుతున్నాయి.







# సోవియట్ అధికారంవల్ల యువజనులకు కలిగిన లాభాలు

పద్దెనిమిదేళ్ళ ప్రాయం వచ్చిన స్త్రీ పురుషులు సోవియట్ అధికార శాఖలకు ఎన్నుకోవచ్చును. ఎన్నుకోబడవచ్చును. పద్దెనిమిదేళ్ళ ప్రాయం గలవారు స్థానిక సోవియట్లకు ఎన్నుకోబడవచ్చును. యిరవై ఒక్క ఏళ్లున్నవారు యూనియన్. స్వపరిపాలక రిపబ్లిక్కులకు ఎన్నుకోబడవచ్చును. యిరవై మూడు ఏళ్ళ వయసు గలవారు సోవియట్ దేశ సుప్రీం సోవియట్ కు ఎన్నుకోబడవచ్చును.

దేశపు అత్యున్నత అధికారశాఖకు ప్రతినిధులలో ముప్పయ్యేళ్ళప్రాయానికి లోపుగా వున్నవారు 110 మంది, ప్రజాప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు. స్థానిక సోవియట్ల ప్రతినిధులు 1,549,000 మందిలో 30ఏళ్ళకు లోపువారు 342,000 మంది వున్నారు.

సోవియట్ దేశపు యువతీ యువకులు అంతర్జాతీయ యువజనోద్యమంలోనూ, ప్రజాస్వామ్య యువజనుల ప్రపంచ సమాఖ్య, అంతర్జాతీయ విద్యార్థి సంఘం కార్యకలాపాలలోనూ ఉత్సాహంగా పాల్గొంటారు. ఇటీవలి

---

జీవితంలో సోవియట్ యువజనులకు ఎన్నో అవకాశాలున్నాయి. వారు వివిధ పరిశ్రమలలో, వృత్తులలో ప్రవేశించవచ్చు. ఇక్కడ మీరు చిత్రంలో చూస్తున్నది యువకుడైన గని పనిమనిషి (పైన)

.........విద్యార్థులు (మధ్య)

.........ఒక నావికుడు (దిగువ)



సంవత్సరాలలో సోవియట్ దేశానికి విదేశాల నుంచి 700 యువజన ప్రతినిధివర్గాలు వచ్చాయి. 1953–1957 మధ్య 73 దేశాలనుంచి పదివేల మందికి పైగా యువతీ యువకులు సోవియట్ దేశ యువజనుల సందర్శనానికి వచ్చారు.

ఐదువందల సోవియట్ యువజన, విద్యార్థి ప్రతినిధివర్గాలు విదేశాలకు వెళ్ళాయి.

లెనిన్ యువ కమ్యూనిస్టు సంఘం, కొమ్సొమోల్స్ 1918లో నిర్మించబడింది. దానిలో యిప్పుడు ఒక కోటి తొంభై లక్షల మంది యువతీయువకులున్నారు.

చదువులోనూ, పనిలోనూ సర్వదా కొమ్సొమోల్స్ దృష్టాంతంగా వుంటారు. ప్రథమ పంచవర్ష ప్రణాళికా సంవత్సరాలలో, స్టాలిన్‌గ్రాడ్, ఖార్కోవ్ ట్రాక్టరు పరిశ్రమలవంటి బ్రహ్మాండమైన సోవియట్ పరిశ్రమల నిర్మా



కుడి పైన: పుస్తక ప్రియులు
కుడి మధ్య: యువ సంగీత దర్శకుడు
కుడి క్రింద: వెల్డర్లు
దిగువ: చిత్రరచనలో నిమగ్నమైవున్న చిత్రకారుడు









ణంలో రెండున్నర లక్షల మంది కొమ్సొమోల్స్ పాల్గొన్నారు. డ్నీపర్ నదిపైని దేశపు మొదటి జలవిద్యుత్కేంద్ర నిర్మాణంలోనూ, ఉరల్స్‌లో మాగ్నిటోగోర్స్క్ ఇనుము ఉక్కు పరిశ్రమ నిర్మాణంలోనూ వారు తోడ్పడ్డారు. దూరప్రాచ్యపు అడవులలో వారొక నగరాన్ని కట్టారు. దానికి వారిపేరే పెట్టబడింది. అది భాగాలలోని బయళ్ళకు వెళ్ళారు.

ప్రస్తుతం సోవియట్ దేశానికి సుమారు 17వేల సాయంత్ర పాఠశాలలున్నాయి. వీటికి 1,816,000 మంది వెళ్తున్నారు. ఒక్క 1965 లోనే 22 వేలమంది యువకార్మికులు, ఉద్యోగులూ సెకండరీ పాఠశాల విద్యను పూర్తి చేశారు.

### యదార్థాలూ, సంఖ్యలూ

సోవియట్ దేశంలో ఇప్పుడు బాలలకు పదకొండు వందల ఆరోగ్య మందిరాలున్నాయి. ఏకకాలంలో ఇవి 100,000 బాలలకు వసతి కల్పించగలవు. వైద్య చికిత్స అవసరమైన బాలలకు, ఆరోగ్య మందిరాలలో ఉచితంగా చికిత్స యివ్వబడుతుంది.

* * *

సోవియట్ బాలలు 2,151 బాలసంఘ పాఠశాల విద్యార్థి భవనాలను, 128 యువసాంకేతికుల, యువ ప్రకృతి ప్రేమికుల స్థావరాలను; 129 బాలల విహార, సంచార కేంద్రాలను, 129 బాలోద్యానాలను, 600 బాలల పుస్తకాలయాలను, 101 బాలల బొమ్మలాట ప్రదర్శన శాలలను; 29 బాలల రైలుదార్లను; 792 బాలల క్రీడా శిక్షణాలయాలను కలిగివున్నారు.



యువజనుల, వృద్ధుల మందస్మితాలు సాధించబడిన లక్ష్యాల, సాధించబోయే ఉజ్వల స్వప్నాల గాథను వివరిస్తాయి



అమూర్ తీరపు కొమ్సొమోల్స్క్. మూడేళ్ళ క్రితం బీళ్ళను సాగుచేయడం మొదలైనప్పుడు మూడున్నర లక్షల మందికి పైగా సోవియట్ యువజన ప్రతినిధులు దేశానికి ఎంతో ప్రాముఖ్యంగల యీ సమస్యను పరిష్కరించడానికి కజకస్తాన్, సైబీరియా, దేశంలోని యితర

ఇరవై లక్షల మంది యువకులు దేశపు సాంకేతిక పాఠశాలల్లో విద్యార్థులుగా ఉన్నారు; యిరవై లక్షల మందికి పైగా కళాశాలల్లోనూ, విశ్వవిద్యాలయాలలోనూ విద్యార్థులుగా వున్నారు. ఏడు లక్షల మందికి పైగా యువ కార్మికులూ, ఉద్యోగులూ, రైతులూ తమ పను





వంటవారి గాయక బృందం

లను మానుకోకుండా కళాశాలల్లో చదువుకుంటున్నారు.

విద్యకోసం యువజనులు ఏమీ చెల్లించనక్కరలేదు. పైగా, ప్రభుత్వం విద్యార్థులకు విద్యార్థి వేతనాలను యిస్తుంది; సెలవుల్లో ఆరోగ్య మందిరాలలోనూ, విశ్రాంతి గృహాలలోనూ గల వసతులన్నిట్లో వారికి నూటికి 10 వంతులవరకు రాయితీ యిస్తుంది.

సోవియట్ దేశ ప్రజల 26 భాషల్లో 155 యువజన వార్తా పత్రికలూ, పత్రికలూ ప్రచురింపబడుతున్నాయి. వాటి మొత్తం ప్రతులు ఒకకోటి 30 లక్షలు. మున్ఫయిలక్షల మొత్తం ప్రతులతో, 37 కథా సారస్వత, సులభ విజ్ఞాన పత్రికలు ప్రచురింపబడుతున్నాయి.

చాలా ఏళ్ళుగా ఒక ప్రత్యేక యువజన సారస్వత ప్రచురణాలయం దేశంలో వుంటూ వుంది. దానిపేరు "మొలొదయా గ్వార్దియా". 1956 లో అది 232 పుస్తకాలను ప్రచురించింది.

దేశపు క్రీడా సంఘాలలోనూ, వ్యాయామ సంఘాలలోనూ ఒక కోటి డెబ్భై ఐదు లక్షల మంది వున్నారు. యువజనులు 60 రకాల ఆటలాడుతారు.



విద్యావంతురాలైన ఒక టెన్నిస్ ఆటకత్తె

షేక్స్పియర్ నాటకంలోని ఒక దృశ్యం







నమూనాలను సరిపోల్చుతూ

ప్రభుత్వమూ, కార్మిక సంఘాలూ సాలుకు అపారంగా ధనాన్ని వెచ్చిస్తాయి, వ్యాయామాన్నీ, క్రీడలను అభివృద్ధి చేయడానికి. యువజనుల అధీనంలో 1500 స్టేడియంలూ, సుమారు 200 క్రిడాస్థలాలూ, 22 వేలకు పైగా ఫుట్‌బాల్ ఆటస్థలాలూ, వందల కొలదీ నౌకావిహార, కేంద్రాలూ యీత చెరువులూ, స్కీ-లతో గంతే స్ప్రింగ్ బోర్డులూ వున్నాయి. కార్మిక సంఘాలకు పెద్ద క్రీడలకు సంబంధించిన 4.500 కట్టడాలూ (స్టేడియంలూ, యీత, స్కీ-యింగ్ కేంద్రాలూ), యాత్రీకపర్వతారోహక కేంద్రాలూ వున్నాయి.

ప్రతి ఏడాదీ దేశంలో కొత్త స్టేడియంలూ, క్రీడలకు సంబంధించిన కట్టడాలూ నిర్మింపబడుతున్నాయి. రష్యన్ సమాఖ్యలో ఇటీవల ఏడువేల క్రీడల కట్టడాలు నిర్మింపబడ్డాయి.

ఏదో ఒక వృత్తిని నేర్చుకోవాలనుకునే యువజనులకోసం చాలా ప్రత్యేక పాఠశాలలూ, తరగతులూ స్థాపింపబడ్డాయి. ఎనభై లక్షలకు పైగా యువతీయువకులు గని పాఠశాలలలోనూ, ఫ్యాక్టరీ శిక్షణాలయాలల్లోనూ, రైలురోడ్డు మొదలైన వృత్తి పాఠశాలలలోనూ 1941 నుండి 1957 మధ్య ఉత్తీర్ణు లయ్యారు.



## యథార్థాలూ, సంఖ్యలూ

సోవియట్ దేశ ప్రసూతి మందిరాలలోను, ఆసుపత్రులలోను 161,510 ప్రసూతి పడకలున్నాయి. ఈ ప్రసూతి విభాగంలో 136,370 మంది మంత్రసానులు పనిచేస్తున్నారు.

వైద్య సంస్థలకు, దాదాపు నూటికి నూర్గురు పట్టణాలలోని గర్భిణీస్త్రీలు, నూటికి తొంభై మంది పల్లెలలోని గర్భిణీస్త్రీలు కాన్పులకు వస్తారు. సుఖప్రసవ పద్ధతులమలుపరచబడుతున్నందువల్ల, పట్టణాలలో అరవై ప్రతిశతి, గ్రామాలలో నలభై ప్రతిశతి మేరకు గర్భిణులు కష్టంలేకుండానే శిశువుల కంటున్నారు.

* * *

1913లో, రష్యాలో మాతాశిశు సంరక్షణాలయాలు 9 మాత్రమే ఉండేవి. ఇప్పుడు, ఇవి 13,400 ఉన్నాయి. ఈ సంరక్షణాలయాలు ప్రతి నవశిశువు పుట్టిన మొట్టమొదటి రోజునుండీ, శిశువుపట్ల శ్రద్ధ వహిస్తుంటాయి. శిశు సంరక్షణాలయాలలో మాతలకు, శిశువులపట్ల ఎటువంటి శ్రద్ధ తీసుకొనవలెనో, శిశువులకు ఎటువంటి ఆహారం యివ్వవలెనో, శిశువును ఏ క్రమాన పరిపోషించవలెనోనన్న విషయాలకు సంబంధించిన సలహాలు యివ్వబడుతాయి.



# కర్మాగార నేతలు కార్మికులే

**అలెగ్జాండర్ దుషెంకోవ్**

*టర్నర్-మెకానిస్ట్, నెవ్‌స్కీ*
*ఇంజనీరింగ్ వర్క్స్, లెనిన్‌గ్రాడ్*

★





వాగాడంబరం నాకు రుచించదు. మా కుటుంబాన్ని "దుషెంకోవ్ రాజవంశం" అని అన్నప్పుడు నాకు సిగ్గు వేస్తుంది. అలా అనిపించుకోవడానికి మేము మొఖాసాదార్లమా, రాజులమా, జమీందార్లమా ? కాని అసలు విషయాన్ని ఆలోచించవలసి వస్తే, మేము నిజంగా రాజవంశీకులమే; మామూలు రాజవంశీకులము కాదు, పరిపాలకులమైన రాజవంశీకులము.

మా తాతగారు మిఖయిల్ దుషెంకోవ్ బలిష్ఠుడు, ఆజాను బాహుడు. ఈయన ఎంతోకాలం బ్రతకలేదు. సుమారు నూరేళ్ళ క్రితం యీయన, ఆకలిబాధకు ఎరఅయిన తన గ్రామాన్ని వదిలి పెట్టి, తనపెద్ద కుటుంబంతో పెత్రోగ్రాడ్ నగరాన్ని చేరుకున్నాడు. ఇక్కడ వర్తకుడు సెమ్యన్నికోవ్ నెవ్‌స్కీ కార్ఖానాలో కమ్మరి పనివానిగా కుదురుకున్నాడు. నేను చెప్పినట్టు ఆయనది బ్రహ్మాండమైన విగ్రహం. కాని ఆయన అట్టేకాలం బ్రతకలేదు. పద్ధాలుగ్గంటలు, పద్దెనిమిగంటలు సైతం పొగలో, మసిలో, కమ్మరి కార్ఖానాలోని విపరీతమైన వేడిలో అదేపనిగా సుత్తిపట్టుక పనిచేస్తూ ఆయన హతమారిపోయాడు.

శతాబ్దంగా వున్న ఆ ఫ్యాక్టరీలో మా కుటుంబం రెండువందల ఏళ్ళు పనిచేసింది. అవును, రెండువందల ఏళ్ళే. మానాన్న అమ్మ, అక్కచెళ్ళెళ్ళు, అన్నదమ్ములు, నేను పనిచేసిన ఏళ్ళను కలిపినట్టయితే. నగరపు పొలిమేరల్లోని నెవస్కయా జస్తవాలో వున్న యితర ఫాక్టరీలలోనూ, మిల్లులలోనూ పనిచేసిన మా బంధువులను కూడా కలిపినట్టయితే, మొత్తం 350 సంవత్సరాలవుతుంది ! దుషెంకోవ్, ఆంద్రియేవ్, లాపిన్ కుటుంబాల రాజవంశాల, యితర శ్రామికుల రాజవంశాల హస్తాలే మా పరిశ్రమను ప్రపంచ ప్రఖ్యాత పారిశ్రామిక సంస్థగా చేశాయి.

దీనికి బదులుగా మా కుటుంబం సంపాదించిన దేమిటి ?

తాతయ్యతోబాటుగా ఆయన పెద్దకొడుకు ఇద్దరూ పరిశ్రమలో పని చేసినా, కుటుంబానికి కడుపునిండా తిండి ఎప్పుడూ దొరకలేదు. మా తాతయ్యను పరిశ్రమలో జలుబుచేసింది, తరువాత ఆయన క్షయ వ్యాధితో మరణించాడు. ఫాక్టరీ ఆవరణలో మానాన్న రైల్వే క్రేను క్రిందపడి చనిపో



ప్రాచీన నర్వా ద్వారం



ఇప్పుడు ఇట్లా కనిపిస్తుంది

యాడు; దారిద్ర్యంవల్ల, పనిభారంవల్ల, పాపం మాతల్లి కాటికి వెళ్ళింది. కార్మికుల శ్రమవల్ల నిర్మింపబడి, నడుప బడే, పేరుపొందిన ఆ ఫాక్టరీ కార్మికులను హతమార్చింది, వికలాంగులను గావించింది.

నలభై ఏళ్ళ తరవాత, యిప్పుడిదంతా నేను ఎందుకు చెపుతున్నానా అని మీకు ఆశ్చర్యం వేయవచ్చును.



అవును, మీరు చెప్పింది నిజమే — జీవితం ఆ రోజులకు యిప్పటికీ పూర్తిగా భిన్నం. నాన్న కుటుంబంతోబాటుగా నివసించిన దరిద్రపు గది యిప్పుడు పోయింది. నా కుటుంబంతో నేను నా స్వంత యింట్లో నివసిస్తున్నాను. ఉదయం నేను పనికి వెళ్ళేటప్పుడు, సామాన్లతో నింపివున్న లారీలు ఒకదాని వెంబడిని ఒకటి కొత్త యిళ్ళకు వెళ్లుతూ వుండడం నాకు కనిపిస్తుంది. ఈ యిల్లు కార్మికులకు లభించినవి. ప్రజలలో కూడా మార్పు వచ్చింది. వాళ్ళు తాతయ్య రోజుల్లోలాగ నిరక్ష్యరాస్యులు కారు. ఫాక్టరీలో పనికోసం దరఖాస్తుపెట్టే సెకండరీ విద్యను పొందిన బాలబాలికలు వీరు. సాయంకాల విద్యాశాలలలో పాఠశాలలకూ పోయేవారు, డజన్లకొద్దీ కార్మిక యువకులున్నారు.

ఇప్పటికి నలభై ఏళ్ళుగా, జాతీయం గావింపబడినప్పట్నుండీ నెవ్‌స్కీ పరిశ్రమను మేమే నడుపుతున్నాం. దుషెంకోవ్ కుటుంబానికి చెందిన మేము ఎవ్వరమూ డైరెక్టర్లుగాని, షాపు సూపరిండెంట్లుగాని కాలేదు, నిజమే. కాని అదికాదు, విషయం. ఫాక్టరీని నడపడమంటే, డైరెక్టరు కుర్చీలో కూర్చోవడం మాత్రమే కాదు. యుద్ధానికి ముందర నేను సామాన్యుడనైన టర్నర్‌ను. అయినా నేను క్రెమ్లిన్‌లో జరిగిన అఖిల సమాఖ్య అగ్రశ్రేణి కార్మికుల సమావేశానికి, మా ప్రభుత్వ నాయకులతోబాటుగా దేశ ప్రాముఖ్యంగల విషయా

కఠిన ప్రక్రియలన్నీ స్వయంచోదకం చేయబడ్డాయి



లను నిర్ణయించడానికి ఆహ్వానింపబడ్డాను. కార్మికులతో చర్చింపబడిన తరవాత మాత్రమే—మా ఫ్యాక్టరీ భవిష్యత్తుగానీ దానిపనికి సంబంధించిన ప్రతిఒక్కటీ, ప్రతి చిన్న విషయంసైతం, యిప్పుడు అమలు జరుపబడుతోంది. గత ఆరేళ్ల కాలంలో కొత్త వేతనాల పద్ధతిని అమలుజరపడానికీ, సాంకేతిక ప్రమాణాలను ప్రవేశపెట్టడానికీ మా పరిశ్రమ మొదటిది. ప్రతిఒక్క ప్రమాణమూ కార్మికులతో చర్చింపబడింది.

లెనిన్‌గ్రాడ్ ఫ్యాక్టరీల నగరం. మేము మొదటి సోవియట్ ఫ్యాక్టరీలను తయారుచేశాము. తరవాత నవి ఉరల్స్‌లోనూ, ఓల్గాతీరాన, సైబీరియాలోనూ తయారు కావడం మొదలైంది. వోల్ఖోవ్, ద్నీపర్, వోల్గా, కామా, అంగారా నదులపైని గల విద్యుత్కేంద్రాలకు సోవియట్ టర్బయిన్లను మేము మొదట తయారుచేశాము. దేశానికి వెలుతురు నిచ్చి, దాని యంత్రాలను నడిపే జనరేటర్లన్నిటిలో వీటికి యించుమించు 80 వంతులు మా నగరంలో తయారుచేయబడ్డాయి. నూతన సాంకేతిక పద్ధతి అయిన ప్రోటాన్ సింక్రోట్రాన్, సెమీ-కండక్టర్లు మా నగరంలో తయారుచేయబడ్డాయి. ఇరవైయవ శతాబ్దపు అద్భుతవిషయమైన పరమాణు హిమవిచ్ఛేదక సాధనం, లెనిన్‌గ్రాడ్ డాకులో నిర్మింపబడుతోంది.

మా ప్రజల కొరకు చాలా కొత్త యంత్రాలను తయారుచేయడంలో, నాకు కూడా కొంత భాగంవుంది. బాల్యంలో, లేత్‌ను నడపడం నేను మొదలుపెట్టినప్పుడు, మొదటి సోవియట్ మానిఫో బాయిలర్ల కొరకు నేను ఎలక్ట్రిక్ ఫిటింగులను తయారు చేసి తరవాత బ్లాస్ట్‌ఫర్నేసుల కొరకు తొలి సోవియట్ బ్లోయర్లను తయారు చేయడంలో తోడ్పడ్డాను. ఇప్పుడు కూడా ఒక సాంకేతిక విషయజ్ఞునిగా, స్తవ్రొపోల్‌కూ మాస్కోకూ మధ్య గ్యాస్ పైప్ లైన్ కొరకు ఒక కొత్త గ్యాస్ టర్బయిన్ కోసరం పనిచేస్తున్నాను.

"కాని మెనెవ్‌స్కీ పరిశ్రమ యింతకు ముందుకూడా అతి కొత్త యంత్రాలను తయారుచేసింది కదా? మీతండ్రి తొలి ఓడలను తయారుచేశారు..." అని మీరు అనవచ్చును.



బోరింగ్ యంత్రాన్ని నడుపు వ్యక్తి



అనుకూల వాతావరణంలో పని ఉల్లాసంగా వుంట.

అవును. నిజమే. మా తండ్రులు చాలా సమర్థులు, అద్భుతమైన యంత్రాలను వారు నిర్మించారు. కాని ఆ యంత్రాలే వారికి ఎదురు తిరిగాయి. ఒక టర్నర్ ఒక డ్రాయింగుయంత్రాన్ని నిర్మించడమూ, దాని ఫలితంగా రెండు డజన్ల మంది కార్మికులు బర్తరఫు చేయబడడమూ గురించి మా పినతండ్రి నాకు చెపుతూ వుండడం జ్ఞాపకం వుంది. ఇవి కొత్త పద్ధతిని కనుగొన్నవానికి యించుమించుగా ప్రాణాంతక మవుతాయి. ఇప్పుడు మా కార్ఖానా కార్మికులు తామే నిర్ణయించారు టర్బయిన్‌ను నిర్మించాలని. 20 వేల పనిగంటలలోగాక, 12 వేల పనిగంటలలో నిర్మించాలని నిర్ణయింపబడింది.

ఇందునిమిత్తం మేము కొత్త యంత్రాలను, నూతనశ్రమ సమీకరణ పద్ధతులనూ, యితర పనులకోసరం కొందరు కార్మికులను విడుదల చేసే యితర చర్యలనూ మేము ప్రవేశ పెడుతున్నాము. గతంలో రేషనలైజేషన్ కార్మికులను నాశనం చేసేది, యిప్పుడు రేషనలైజేషన్ మనకి సేవ చేస్తోంది.



"దుషెన్‌కోవ్, నువ్వు పేలవన కాస్త ఎక్కువగా చేస్తున్నట్టుందే. కొన్నికొన్ని సందర్భాలలో మంచి నూతన కల్పనలు గుర్తింపబడడానికీ, ఆమోదింపబడడానికీ చాలా కష్టమవుతోన్నదని సోవియట్ పత్రికలూ, పుస్తకాలు అంగీకరిస్తున్నాయిగదా!" అని మీరు అడుగవచ్చును.

అవును, యిటీవల ఫాక్టరీలు వేరుపడి వున్నప్పుడు, లేదా వాటిమధ్య "సరిపాలనా సంబంధమైన నిరోధాలు" వున్నప్పుడు, నూతన పద్ధతులు అమలు జరగకుండా ఆటంకం కలిగేది. వివిధ మంత్రివర్గ శాఖలకు చెందిన యిరుగు పొరుగు ఫాక్టరీలు సాధారణంగా పరస్పరం సహాయం చేసుకునేవి కావు. ఇందువల్ల ఒక కొత్త పద్ధతి ఒక ఫాక్టరీలో అమలు జరుపబడినప్పుడు, అది దాని పొరుగువాటిలోనికి తరచు ప్రవేశపెట్టబడేది కాదు. ఇందువల్లనే మా ప్రభుత్వం పారిశ్రామిక నిర్వహణా పునర్నిర్మాణానికి నిర్ణయించి, యీ సమస్యను ప్రజల ముందుంచింది. మళ్ళీ ఈ విషయంలో కూడా కార్మికులు కార్యదేశాధినాయకులని నిరూపించుకున్నారు. మా పరిశ్రమలో, సమావేశాల్లోనూ, ప్రభుత్వానికి లేఖల్లోనూ దేశం అంతటా పారిశ్రామిక నిర్వహణను అభివృద్ధి చేయడానికి 700 కు పైగా సూచనలు చేయబడ్డాయి. ఈ విషయం తమ అభిప్రాయం చెప్పడానికి అధికారం గల, యింటిచోట్లలోని లక్షలాది మంది కార్మికుల మాటేమిటి? సుప్రీం సోవియట్ సమావేశ పర్చబడినప్పుడు, యావత్ప్రజల అభిప్రాయాలపైని చేసిన కృషిని అది ఆదారపర్చగలిగింది; యిందుచేత పారిశ్రామిక నిర్వహణకు సంబంధించిన ముఖ్య సమస్యను పరిష్కరించేటప్పుడు తప్పులు జరగకుండా చేయగలిగింది.

ఈ పునర్నిర్మాణం వల్ల మా దేశానికి ఎలా లాభించిందో యిప్పుడు తెలుస్తోంది. చిన్నదైనప్పటికీ, చాలా ప్రముఖమైన ఒక ఉదాహరణను యిక్కడ యిస్తాను: లెనిన్‌గ్రాడ్‌లోని జదనోవ్ పరిశ్రమలోని ముగ్గురు ఇంజినీర్లు యిటీవల, గ్యాసు వెల్డింగ్ నిమిత్తం ఒక కొత్తరకం టార్చ్‌ని సూచించారు. ఇది ఉపయోగింపబడే అసిటిలెన్‌లో నూటికి 50 వంతులు ఆదా చేస్తుంది. ఈ టార్చి గురించి తెలిసినప్పుడు మా ఆర్థిక సమితి చేసినదేమిటి? అది వెంటనే లెనిన్‌గ్రాడ్ ఆర్థిక మండలంలోని ప్రతినిధులందరినీ సమావేశపర్చి, కొత్త టార్చిని వారికి చూపి, యావత్తు జిల్లాకోసం దానివంటివి ఒక వెయ్యింటిని తయారు చెయ్యమని రెండు పరిశ్రమలను ఆజ్ఞాపించింది. మన మిల్లుల్లో అవి ఉపయోగింపబడినప్పుడు, అవి మా నగరానికి సాలుకు ఒకకోటి రూబుళ్ళను పొదుపు చేస్తుంది. ఈ పద్ధతిని ప్రవేశపెట్టిన మా లెనిన్‌గ్రాడ్‌వారు, తక్కిన ఆర్థిక సమితులన్నిటికీ, ఆ టార్చి యొక్క సాంకేతిక చిత్రపటాలను ఉచితంగా పంపారు. ఇది మా దేశానికి అనేక లక్షల రూబుళ్ళను పొదుపు చేస్తుంది.

నాకు ప్రయాణం చేయడమంటే చాలా యిష్టం. మా దేశం ఎంతగా సిరిసంపదలతో విలసిల్లుతూవుందో కళ్ళారా చూడాలనుకున్నాను. నా యాత్రలు ఎంతగా బాగున్నప్పటికీ, మా నెవ్‌స్కయా జస్తవాకు దూరంగా వున్నప్పుడు నాకెప్పుడూ ఒంటరితనమనిపించేది. మా కుటుంబం తరతరాలుగా ఒకేఒక మిల్లుకు, ఒకేఒక జిల్లాకు తమ జీవితాల నర్పించింది.

మా జిల్లాకంటె కార్మికులు ఎక్కువగా ప్రేమించే జిల్లా ఒకటి లెనిన్‌గ్రాడ్‌లో వుంటనుకోను. పనికి వెళ్ళేందుకు రోజూ నేను నడిచివెళ్ళే యీ వీధినే, అప్పుడు ఒక బారిస్టరువద్ద సహాయకునిగా పనిచేసే వి. ఐ. లెనిన్, గత శతాబ్దం చివరలో కార్మికుల పక్షకు శీఘ్రగతిలో వెళ్తూ వుండేవారు. మా మిల్లులోనే ఆయన మొదటి కార్మికుల మార్క్సిస్టు కేంద్రాన్ని స్థాపించారు, మా తండ్రుల కోసరం తన మొదటి కరపత్రాన్ని వ్రాశారు. మా నాన్న వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్‌ను చూశారో లేదో నాకు తెలియదు. కాని ఆయన లెనిన్ రచనలను చదివారు, ఆయనకు లెనిన్ సిద్ధాంతాల్లో పూర్తిగా విశ్వాసం కుదిరింది. మా నాన్న చదువుకున్న పాఠశాలలోనే లెనిన్ భార్య, కామ్రేడ్ నదెజ్దా క్రుప్స్కయా బోధించేవారు.

నా జీవితంకూడా పూర్తిగా మా మిల్లుకు అంకితమైపోయింది. నేనింకా వృద్ధుణ్ని కాలేదు. ఇంకొంత కాలం పనిచేసి నేను దేశసేవ చేయగలనని ఆశిస్తున్నాను. కాని నేను పెన్షన్ పుచ్చుకున్నాక, నాకంటె పెద్దవారైన మిత్రులు చేస్తున్నట్టుగా బహుశా ఉదయం మిల్లుకు వెళ్తుంటాను, కార్ఖానాల్లో తిరుగుతూ, యువకులైన టర్నర్లతో సంభాషిస్తాను. వృద్ధాప్యంలో యిబ్బంది లేకుండా వున్న పింఛనీదారుణ్నయిన నేను మిల్లు విషయాల్లో ఎందుకు యింతగా ఆసక్తిని తీసుకుంటున్నానని ఎవరేనా అడిగితే, పూర్వం ఫోర్‌మెన్‌గా పనిచేసి యిప్పుడు పింఛనీ పుచ్చుకున్న ముసలి ఆంద్రియేవ్ నాకీ మధ్యను చెప్పినట్టుగా "ఇవాన్ వాసిల్యేవిచ్ నీ కర్థంకావయ్యా — అది నా మిల్లు!" అంటాను.

## యదార్థాలూ, సంఖ్యలూ

ఈ శిశు సంరక్షణాలయాల ఆధ్వర్యంలో 3 500 "బాలల వంటశాలలు" పని చేస్తున్నాయి. ఇవి, శిశువులకిష్వతగిన వివిధాలైన ఆహార పదార్థాలను, ద్రవద్రవ్యాలను తయారుచేస్తున్నాయి.

* * *

బాల వైద్య, బాల రోగ నివారక సంస్థలలో ఇప్పుడు 35,000 మంది వైద్యులు పని చేస్తున్నారు.

* * *

సోవియట్ చట్టాన్ననుసరించి, గర్భవతులైన స్త్రీలు, జీతంమీద 112 రోజుల సెలవు పొందుతారు. శిశు జననానంతరం మాత, జీతం లేకుండా 3 మాసాలు సెలవు తీసుకొనడానికి హక్కు కలిగివున్నది. ఇటువంటప్పుడు, ఇదివరలో ఆమె నియుక్తురాలై వున్న స్థానం, ఆమెకొరకే కేటాయించబడి వుంటుంది.

కాగా సోవియట్ చట్టానుసారం, గర్భిణీస్త్రీలకు, నవశిశువునుకన్న తల్లులకు రాత్రుల, అదనపువేళల నిర్వర్తించవలసి వున్న విధులు అప్పగించబడవు. పరిశ్రమల, సంస్థల నిర్వాహకులు ఇట్టి మహిళలను, వారు ఇదివరలో పొందుతున్న వేతనముల మీదనే అంతకన్న సుకరమైన, తేలికైన పనులలో వారిని నియోగించవలసి ఉంటుంది. నవశిశువులు కలిగిన మాతలు, జీతపు కోతలేకుండా, పనిరోజునఅదనపు విరామ సమయాలను పొందుతుంటారు.



వి. ఐ. లెనిన్ వద్దకు వచ్చిన కర్షక వార్తావహులు

చిత్రకారుడు : సెరోవ్

# అక్టోబర్ విప్లవం, ప్రాచ్యఖండమూ

వి. బందర్ ఛుక్
మాస్కో విశ్వవిద్యాలయం

అక్టోబరు మహావిప్లవం వలస, పరాధీనదేశాలలో సామ్రాజ్యవాద స్థానాన్ని కదిల్చివేసి, తమ విముక్తికోసం ప్రాచ్య ప్రజల పోరాటాన్ని మహత్తరంగా విజృంభింప జేసింది.

విప్లవానికి పూర్వపు రష్యాలో రష్యన్ కార్మిక కర్షకుల దోపిడీ, రష్యన్ సామ్రాజ్యవాదం క్రింద నుండడంవల్ల జారిజంచే పలుజాతుల దోపిడీతో కలిసి వుండేది. రష్యాలోని శ్రామికవర్గం, రష్యన్ సామ్రాజ్యంలోని పీడిత ప్రజలను విముక్తి గావించకుండా, తన్నుతాను విముక్తి గావించుకోలేదు. అక్టోబరు విప్లవం జరిగిన కొద్ది రోజులకు, మానవచరిత్రలో మొట్టమొదటిసారిగా దేశాల మధ్య పూర్తిగా కొత్తరకపు సంబంధాలను రూపొందిస్తూ సోవియట్ ప్రభుత్వం రష్యా ప్రజల హక్కులకు సంబంధించిన ప్రకటనను ప్రచురించింది. పూర్వపు పాలకవర్గాలు అనుసరించిన, ఒక ప్రజను ఇంకో ప్రజపైకి రెచ్చగొట్టే సిగ్గుచేటయినవిధానం తిరస్కరింపబడి, ఐచ్ఛికమైన, నిజాయితీగల, స్థిరమైన ప్రజల సమాఖ్య దాని స్థానంలో నెలకొల్పబడింది. రష్యా ప్రజల సమానత్వ, సార్వభౌమత్వ సూత్రాలు, విడిపోయే హక్కు, స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడే హక్కుతో బాటుగా స్వేచ్ఛాయుతమైన వారి స్వయంనిర్ణయ హక్కు, జాతుల విషయంలో విధానానికి ప్రాతిపదికగా ప్రకటింపబడ్డాయి.

సోవియట్ ప్రభుత్వం సర్వదా యీ సూత్రాలను అమలు జరిపింది. అది ఫిన్లండ్, పోలెండ్ మొదలైన దేశాల జాతీయ స్వాతంత్ర్యాన్ని గుర్తించింది; ప్రాచ్యదేశాల విభజన, దాస్యాన్ని కలిగించే జారిస్టు, తాత్కాలిక ప్రభుత్వాల ఒడంబడికలనూ, విప్లవానికి పుందర జారిజానికీ, కొన్ని ప్రాచ్యదేశాలకు మధ్య జరిగిన అసమానమైన ఒడంబడికలను కూడా రద్దుచేసింది. ఆ దేశాల్లో రష్యాకుగల ప్రత్యేక సౌకర్యాలన్నీ రద్దు గావింపబడ్డాయి.

1917 డిసెంబరులో, "రష్యాలోనూ ప్రాచ్యంలోనూ గల శ్రామిక మహమ్మదీయులందరికీ" ఉద్దేశింపబడిన తన ప్రకటనలో సోవియట్ ప్రభుత్వం, ప్రాచ్య ప్రజల విషయంలో జారిజంయొక్క రాక్షస విధానాన్ని తిరస్కరిస్తున్నానని తెలియజేసింది. 1919 వసంతంలో సోవియట్ రష్యాప్రభుత్వం ఆఫ్ఘనిస్థాన్ సార్వభౌమ హక్కులను గుర్తించింది, 1921 లో దానితో సమాన ప్రాతిపదికపైని ఒక ఒడంబడికను చేసుకుంది; ఆ దేశ జాతీయ స్వాతంత్ర్యం పటిష్టం కావడానికి యిది చాలా తోడ్పడింది. సోవియట్ ప్రభుత్వం తన సేనలను ఇరాన్‌నుండి ఉపసంహరించింది, ఆ దేశానికీ జారిస్టు ప్రభుత్వానికీ మధ్య జరిగిన అసమానమైన ఒడంబడికలన్నిటినీ రద్దు చేసింది, ఇరాన్‌లో తనకుగల ప్రత్యేక సౌకర్యాలను వదులుకుంది.

పలుదేశాల కూటమి సాయుధ జోక్యానికి వ్యతిరేకంగా టర్కిష్ ప్రజలు సాగించిన పోరాట దినాలలో, సోవియట్ రష్యా ఒక్కటే వారి స్వార్థరహిత మిత్రరాజ్యంగా వుండేది. సోవియట్ ప్రభుత్వం టర్కీకి చేసిన నైతిక, భౌతిక సహాయం, సామ్రాజ్యవాద జోక్యానికి వ్యతిరేక పోరాటంలో గొప్ప ప్రాధాన్యంగల విషయం. ఆ అండవల్ల టర్కిష్ ప్రజలు జోక్యందారుల దాడులను తిప్పికొట్టి, తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకో గలిగారు.

అక్టోబరు మహావిప్లవం చైనా ప్రజల భవిష్యత్తుపైని అపారమైన ప్రభావాన్ని చూపింది. ప్రసిద్ధమైన "మే 4, 1919 ఉద్యమం"—యిది అధ్యక్షుడు మావ్‌సె-టుంగ్ నాయకత్వాన "ప్రపంచ విప్లవ హెచ్చరిక ఫలితంగా, రష్యన్ విప్లవ హెచ్చరిక ఫలితంగా, లెనిన్ హెచ్చరిక ఫలితంగా ఉదయించింది-చైనా జాతీయ విముక్తి ఉద్యమ చరిత్రలో ఒక నూతనాధ్యాయం. చైనీస్ విప్లవకారులూ, శ్రామికవర్గమూ అక్టోబరు విప్లవ నిర్మిత పథాన అడుగిడుతూ, చైనా ప్రజలను సంపూర్ణ విజయానికి, దృఢమైన సార్వభౌమ ప్రజారాజ్య సృష్టికి తీసుక వెళ్ళారు.

సోవియట్ రాజ్యం ప్రకటించిన, ఆచరణలో పెట్టిన జాతీయ విధాన సూత్రాలు, ప్రాచ్య ఖండంలోని కోట్లాదిమంది ప్రజలలో ఆత్మ చైతన్యం ఉదయించడానికి అమూల్య ప్రాముఖ్యం గలవి, అక్టోబరు విప్లవ విజయమూ, విదేశీ జోక్యానికి వ్యతిరేకంగా పోరాటంలో సోవియట్ రాజ్య విజయమూ సామ్రాజ్యవాదుల బలహీనతనూ, వారికి వ్యతిరేకంగా జయప్రదంగా పోరాటాన్ని సాగించడానికి గల సుసాధ్యతనూ ప్రాచ్య ప్రజలకు సుస్పష్టం గావించాయి. అక్టోబరు విప్లవానంతరం మొదటి పదేళ్ళలోనే ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని డజన్లకొలదీ దేశాలు—చైనా, భారత దేశాలనుండి మొరక్కో వరకూ, ఆఫ్ఘనిస్తాన్‌నుండి ఇండొనీషియావరకూ—సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విముక్తి ఉద్యమ మండలంగా మారాయి. ప్రాచ్య ఖండంలోని వలస, పరాధీన దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంఅనేకరూపాలను ధరించింది; చైనాలో భయంకరమైన రక్తపాత సహితమైన విముక్తి యుద్ధాల రూపంనుండి, భారతదేశంలో శాంతియుతమైనవే అయినప్పటికీ అత్యంత దృఢమైన శాసనోల్లంఘనోద్యమాల రూపంవరకు అది ధరించింది. వివిధవర్గాలూ, పక్షాలూ

పాల్గొన్నాయి, వివిధ ఆచరణాపద్ధతులు అవలంబింపబడ్డాయి, డజన్ల కొద్దీ దేశాలూ, కోట్లకొలదీ ప్రజలూ పాల్గొన్న యీ విముక్తి సమరంలో. కాని తమ విముక్తికోసరం పోరాడుతోన్న దాస్యం క్రింద నున్న ప్రజలందరూ వలసపీడన, దోపిడీలనుండి బయటపడడానికీ, సార్వభౌమ జాతీయ రాజ్యాల నిర్మాణాన్నీ, సమానత్వాన్నీ, దేశాల మధ్య సంబంధాలను ఐక్య విరహితలో సాధించడానికీ ఒకేవిధంగా సంసిద్ధంగా వున్నారు. సరిగ్గా యివే భావాలు, సోవియట్ రష్యాలో జయప్రదమైన విప్లవం ప్రకటించింది, బలపర్చింది.

ప్రాచ్యప్రజలకు గాఢాంధకార దినాలలో, జపానీస్ సామ్రాజ్య వాదం చైనాను కాల్చుక తింటున్నప్పుడు, బ్రిటిష్ వలస ప్రభువుల బందిఖానాలలో వేలాదిమంది భారతీయ దేశభక్తులు మ్రగ్గుతున్న ప్పుడు, డచ్చి సామ్రాజ్యవాదులు ఇండొనీషియన్ కర్షకులను కాల్చి చంపుతూ వున్నప్పుడు. సోవియట్ రాజ్యపు అస్తిత్వం ప్రాచ్యఖండ పీడిత ప్రజలందరికీ గొప్ప నైతిక సహాయంగా వుండేది. మధ్యాసియా, కకాసస్‌లలోని జాతులకు యితరులతోబాటు సమాన ప్రాతిపదిక పైని సర్వతోముఖాభివృద్ధికి అవకాశాన్ని కలిగిస్తూ సోవియట్ దేశం నెలకొల్పిన ఆదర్శం, పరిశ్రమలు, సంస్కృతి, కళలలో అపూర్వమైన అభివృద్ధికి పరిస్థితులను సృష్టించింది; ఆసియా, ఆఫ్రికా ఖండాల ప్రజలను మరింత ఉత్సాహకరమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి ఉత్తేజపర్చి, అంతిమ పోరాటంలో వారికి విశ్వాశాన్ని కలిగించింది. సోవియట్ భూమిలో జయప్రదమైన దేశాల సమానత్వం, స్నేహం అన్న భావాలు, మానవజాతి ప్రగతిలో నూతనావకాశాలను కల్పిస్తూ వలస సామ్రాజ్యాల మారుమూలలకు చొచ్చుకపోయాయి.

ద్వితీయ ప్రపంచయుద్ధంలో స్వేచ్ఛాకాముక ప్రజల విజయం ప్రపంచ సామ్రాజ్యవాద వ్యవస్థకు ఒక కొత్త దెబ్బకొట్టి, దానిని నీరస పర్చింది; యీ విధంగా చాలా ప్రాచ్యజాతుల ప్రజల విముక్తి సమరం జయప్రదంగా ముగియడానికి పరిస్థితులను సృష్టించింది. యుద్ధానంతర సంవత్సరాలలో, దృఢమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట సంవత్సరాలలో ప్రాచ్యఖండ ప్రజలు సేకరించుకున్న అపార శక్తి భారత దేశంలోనూ, చైనా, బర్మా, ఇండొనీషియా, ఈజిప్టు, సిరియా మొదలైన దేశాలలోనూ వలస పీడనకు స్వస్తి చెప్పిన జాతీయ ఉద్యమ రూపంలో ప్రవహించింది. సుమారు 130 కోట్ల మంది ప్రజలు వసల దాస్యాన్ని వదుల్చుకున్నారు. జాతీయ స్వాతంత్ర్యము కొరకు ఆసియా, ఆఫ్రికా ఖండాల ప్రజల మహత్తర కృషిని — అందరి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ, చిన్న పెద్ద దేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ రక్షించే సోవియట్ రాజ్యం సర్వదా సంపూర్ణంగా అవగాహన చేసుకుంది, బలపర్చింది. డచ్చి సామ్రాజ్యవాదులు ఒడంబడికలన్నిటినీ కాలరాసి, ఇండొనీషియన్ల విముక్తి ఉద్యమాన్ని రక్తపాతంలో ముంచివేయడానికి ప్రయత్నించినప్పుడు, మిత్రరాజ్య సమితిలో సోవియట్ ప్రతినిధులు దౌర్జన్యాలు నిరసింపబడాలని పట్టుబట్టేరు. ఇజ్రాయిల్ అభివృద్ధి నిరోధక వర్గాల సహాయంతో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ఈజిప్టుకు వ్యతిరేకంగా బాహాటమైన సాయుధ జోక్యానికి పూనుకున్నప్పుడు, దృఢమైన సోవియట్ ప్రభుత్వపు విస్పష్ట విధానం, ఆ వలస యుద్ధాన్ని వారు ఆపివేసేటట్టుగా చేసింది. పశ్చిమ ఇరియన్ తిరిగి యిచ్చివేయాలన్న ఇండొనీషియన్ రిపబ్లిక్ న్యాయయుతమైన కోర్కెను, గోవా గురించి భారత దేశానికి గల హక్కును సోవియట్ ప్రభుత్వం సర్వదా బలపర్చుతోంది. ప్రస్తుతం ప్రాచ్యఖండ ప్రజలు తమ సంపూర్ణ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడానికి కృషిచేస్తున్నారు, తమ జాతీయార్థిక విధానాలలో విదేశీ గుత్త వ్యాపారుల పెత్తనాన్ని తొలగించుకోవడానికి కృషి చేస్తున్నారు. ఈ ఉత్కృష్ట కృషిని సోవియట్ దేశం నిజాయితీతో, నిస్వార్థంగా బలపర్చుతుంది. సోవియట్ ప్రభుత్వం భారత దేశానికి, ఇండొనీషియా, అఫ్ఘనిస్తాన్ మొదలైన దేశాలకూ అవసరమైన యంత్రసామగ్రినీ, సాంకేతిక ప్రవీణుల సలహాలూ, ఋణాలు — యీ దేశాల పారిశ్రామికీకరణను సులభతరం గావించే వీటిని అందజేస్తూవుంది.

విప్లవంలో ఆవిర్భవించిన సోవియట్ దేశం ఆసియా, ఆఫ్రికా ప్రజలకు నిజమైన మిత్రదేశం—అది ప్రతి ప్రగతిమార్గాన్ని బలపర్చుతుంది; అక్టోబరు విప్లవ పథాన్ని నిరోధించి సోవియట్ దేశ ప్రజల ప్రగతిని అరికట్టలేకపోయిన అభివృద్ధి నిరోధక శక్తులవలెనే, నవ జీవనంకొరకు, ఉజ్జ్వల భవిష్యత్తు కొరకు స్వేచ్ఛాకాముక ప్రాచ్య ప్రజల ఉద్యమాన్ని అభివృద్ధి నిరోధక శక్తులు అరికట్టలేవని తెలుసుకున్న ప్రాచ్యప్రజల న్యాయయుతమైన వాంఛ లన్నిటినీ అది బలపర్చుతుంది.

## యుద్ధాలూ, సంఖ్యలూ

అధిక సంతానం కలిగిన తల్లులకు, అవివాహిత మాతలకు, సోవియట్ చట్టం, ప్రభుత్వ భృతులనుకల్పిస్తున్నది. దీని ననుసరించి, 1958వ సంవత్సరంలో, అధిక సంతానంకలిగిన, అవివాహితమాతలైన స్త్రీలకు రమారమి 8,400మిలియన్ల రూబుళ్ళు వెచ్చించబడ్డాయి.

# నిన్న, నేడు  సచిత్ర సమీక్ష

"బ్రియన్‌స్క్ మండలంలోని మొయ్‌సెయేవ్కా గ్రామ కర్షకుడు తన కుటీరంలో విద్యుద్దీపాన్ని వెలిగిస్తున్నాడు" అని వ్రాసివుంది, 1928వ తేదీ గలిగి, మాస్కోలోని ప్రభుత్వసినిమా ఫొటోఫోనో ఆర్కైవ్‌లో భద్రపరుపబడిన యీ ఛాయాచిత్రం క్రింద (ప్రక్కనున్న ఛాయాచిత్రం). ఇంట్లో వడికిన నూలు జుబ్బా వేసుకునివున్న యీ ముసలాయన తదేకదృష్టి. సాయంత్రం కాకముందరే ఆ అద్భుతమైన కాంతిని చూడడానికి కిటికీకి దుప్పటి కట్టిన ఆ రైతు స్త్రీ కళ్ళలో ఆశ చూడండి.

శతాబ్దాలుగా శీతకాలపు రాత్రులు రైతుల యిళ్ళలో కనిపించీ కనిపించని వెలుగునిచ్చే ఒత్తులు మాత్రమే దీపాలుగా వున్న రైతుల కుటీరాల్లో విద్యుద్దీపం చూడడం, నిజంగా ఒక అద్భుత విషయం.

విద్యుద్దీపాలకు ప్రజలు పెట్టిన పేరు "ఇల్యిచ్ బల్బులు" అని. "యావద్దేశపు విద్యుదీకరణతో బాటుగా సోవియట్ అధికారం, కమ్యూనిజం" అన్నారు లెనిన్. రష్యా విద్యుదీకరణకొరకు ప్రభుత్వ ప్రణాళిక (గొయిల్రో ప్రణాళిక). విప్లవానంతరం వెంటనే ఆయన సూచనపైని విపులీకరింప బడింది.

అది అద్భుతమైన ప్రణాళిక, ఆ కాలంలో నమ్మశక్యం కానిది. చాలా మంది అది సాధ్యమవుతుందనుకోలేదు. అది నెరవేర్చబడడం మాత్రమే కాకుండా, యీ శతాబ్దపు నాలుగో దశాబ్దం ప్రారంభం సరికి అంచనాకు మించింది కూడా.

1955లో సోవియట్ దేశం, 1920లో కంటె 312 రెట్లు అధికంగా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసింది. ఇంకో మాటలలో చెప్పాలంటే, ఐదవ పంచవర్ష ప్రణాళికాకాలం అంతం సరికి ఒక రోజులో, 1920లో ఒకసంవత్సరంలో ఉత్పత్తి చేసినంతగా విద్యుచ్ఛక్తి తయారయింది. గ్రామాల్లో విద్యుద్దీపాలు అబ్బురాలు కాకుండా పోయి చాలాకాలమైపోయింది. విద్యుచ్ఛక్తి కుటీరాలకు వెలుగు నివ్వడం మాత్రమే కాకుండా, ఆవులకు పాలుతీస్తుంది. గొర్రెలకు ఉన్నిని కత్తిరిస్తుంది, ధాన్యాన్ని నూర్పుతుంది.

బ్రియన్‌స్క్ గుబెర్నియా, మొయ్‌సెయేవ్కా గ్రామంలోని ఒక రైతు. మొట్టమొదటిసారిగా తన కుటీరంలోని విద్యుద్దీపపు మీట నొక్కుతోన్న దృశ్యం. 1928.
(సినిమా,ఛాయాచిత్ర, పత్ర సంచయంనుండి)



ఇవనోవోలోని ఒక బట్టలమిల్లులోని నేత విభాగ దృశ్యం

పురాతనమైన యంత్రాలూ, అర్థ-శరీరశ్రమ, కార్మికస్త్రీల తీక్ష్ణ శ్రద్ధావృక్కులూ మీకు ఛాయాచిత్రంలో కనిపిస్తాయి. పాతికేళ్ళ క్రితం బట్టల, అల్లినబట్టల పరిశ్రమలో వారీవిధంగా పనిచేసేవారు. ఈ రకపు శ్రమవల్ల ఉత్పాదన బహు స్వల్పంగా జరిగేది. అతి కష్టంగా వుండేది.

విశాలమైన, గాలి వెలుతురులు బాగా వచ్చే గృహాలూ, విద్యుచ్ఛక్తిచే నడుపబడే యంత్రాలూ, యీ క్లిష్టమైన యంత్రాలన్ని







టినీ అదుపులోపెట్టే చక్కగా దుస్తులు ధరించిన కార్మిక స్త్రీలు— నేటి బట్టల పరిశ్రమలోని ఒక కార్ఖానా చిత్రం యిది. యంత్రాలు ఉత్పాదనను అనేక రెట్లు హెచ్చించడం మాత్రమే కాకుండా, పని పరిస్థితులను బాగా అభివృద్ధి చేశాయి కూడా.

బట్టల మిల్లుల్లోపలి దృశ్యం

ఈ చిత్రంలో పరంజా (ముఖానికి ఒక నల్లని ముతకముసుగు) వేసుకుని వున్న ఒక స్త్రీ కనిపిస్తుంది. మధ్యాసియా స్త్రీలు గతంలో దానిని ధరించేవారు. ముఖం కప్పుకోకుండా స్త్రీలు బయట కనిపించకూడదని ఆ రోజుల్లో నిషేధం వుండేది. ఆ పక్కని

చాలా సామాన్యంగా కనిపించే ఒక ఛాయాచిత్రం ప్రక్కపుటలో పైన వుంది. ఒక ఉజ్బెక్ ప్రొఫెసర్ ఉజ్బెక్ విద్యార్థులకు ఉపన్యసిస్తున్నారు. దాని వివరణ · తాష్కెంట్ వైద్య విద్యాలయ శరీరశాస్త్ర శాఖాధిపతి ప్రొఫెసర్ యుసుపోవ్ రెండో సంవత్సరం విద్యార్థులకు ఉపన్యసిస్తున్నారు.

దాని తరవాత మనకు యింకో ఛాయాచిత్రం కనిపిస్తుంది మధ్యవయస్కులు పలపాగాలతో, దిప్ప టోపీలతో, గిరల బట్టలతో తూర్పు దేశాలలోవలె ఒక రగ్గుమీద కూచొని, కాయ కష్టంపిల్ల మోటుగా వున్న తమ చేతులతో మొదటిసారిగా వ్రాయ డానికి ప్రయత్నిస్తారు. ఒక ఉజ్బెక్ గ్రామంలో నిరక్షరాస్యతను నిర్మూలించడానికి ఏర్పడిన కేంద్రం యిది. ఈ చిత్రం 1932 లో తీయబడింది.

ఈ రెండు చిత్రాలూ, ముఖ్యంగా యీ ఆసియా దేశ చ

ఉజ్బెక్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ ప్రభుత్వ సంగీత మందిరానికి చెందిన నటి, లాలా కరియేవా. (కుడి)
ఛాయాచిత్రకారుడు జెల్మా



తాష్కెంట్‌లోని ప్రభుత్వ సంగీత నృత్య నాటక ప్రదర్శనాలయం (దిగువ)

పూర్వపు ఉజ్బెకిస్తాన్ వనిత
ఛాయాచిత్రకారుడు జెల్మా

నృత్యం చేస్తూవున్న, జడలుగల ఆ యువతికి తప్ప ఎవరికి తెలుసును (ఎడమను పైనున్న చిత్రం)—ఆమె పరంజా వేసుకునివున్న ఒక అజ్ఞాత స్త్రీ కుమార్తె యేమో. ప్రాచ్యంలో స్త్రీలు యిప్పుడు తమ భవిష్యత్తుకు తామే యజమానులు.









త్రను మీరు జ్ఞాపకం తెచ్చుకున్నట్టయితే, చాలా అసాధారణమైనపని స్ఫురిస్తుంది. గతంలో యించుమించు పూర్తి నిరక్షరాస్యతతో వున్న ఉజ్బెకిస్తాన్‌కు యిప్పుడు 5,500కు పైగా పాఠశాలలున్నాయి. వాటిలో 1.3 మిలియన్లమంది పిల్లలు చదువుకుంటున్నారు. చదవడమూ, వ్రాయడమూ రానివారెవరూ యీ రిపబ్లిక్కులో లేరు. విప్లవానికి ముందర అక్కడ ఒక్క ఉన్నత విద్యా సంస్థ కూడా లేదు. నేడు ఉజ్బెక్ రిపబ్లిక్కుకు 31 ఉన్నత విద్యాశాలలూ, 100 ప్రత్యేక సెకండరీ పాఠశాలలూ సుమారు 130,000 మంది యువతీ యువకులకు శిక్షణ నిస్తున్నాయి. ప్రతి పదివేలమందికీ రిపబ్లిక్కులో 95 మంది, ఉన్నత పాఠశాలల్లో శిక్షణను పొందినవారు. ఇది ఫ్రాన్సుకు రెట్టింపు, టర్కీకి ఏడురెట్లు, ఇరాన్‌కు 23 రెట్లు.

* * *

**1919**లో ఎనిమిదవ పార్టీ కాంగ్రెస్‌లో లెనిన్ యిలా చెప్పారు: "రేపు మీరు ఒక లక్ష ఒకటోరకం ట్రాక్టర్లను తయారుచేసి, వాటికి బెంజైన్‌ను యిచ్చి, సాంకేతిక నిపుణులను వాటికి అనుబంధించ గలిగినట్టయితే (యిది యింకా స్వప్నమేనని మీకు బాగా తెలుసును), సామాన్యరైతు తాను కమ్యూనిజాన్ని బలపర్చుతాను అని అంటాడు.

ఆ రోజులకు అది నిజంగా స్వప్నమే. విప్లవానికి పూర్వపు రష్యా వ్యవసాయం చాలా నిరాశజనకంగా వుండేది: సుమారు ఒకకోటి కర్రనాగళ్లు, ఒకకోటి 80 లక్షల కర్ర నొల్లలూ, నలభై లక్షలు మాత్రం ఇనుప నాగళ్ళు వుండేవి. ఇటువంటి "యంత్రాల"తో యుద్ధానికి పూర్వపు పాత, రష్యా గ్రామసీమల్లో సేద్యం చేయబడేది.

1955 ఆఖరుకు మా వ్యవసాయానికి సుమారు 1,450,000 ట్రాక్టర్లూ (15 అశ్వశక్తి ప్రమాణంలో), 338,000 ధాన్యపు కోత యంత్రాలూ, 544,000 లారీలూ వున్నాయి. బీళ్ళ దున్నడం నూటికి 98 వంతులు యాంత్రికం చేయబడింది. పొలాల దున్నడం నూటికి 99 వంతులు యాంత్రికం చేయబడింది. ధాన్యం విత్తనాల వేత నూటికి 94 వంతులు, ధాన్యం కోత నూటికి 81 వంతులూ యాంత్రికం చేయబడింది.

"క్షేత్రనౌక" అని ప్రజలచే అనబడే యీ ధాన్యం కోత యంత్రంవంటి శక్తివంతమైన యంత్రాలు -మా దేశంలోని పొలాల్లో ధాన్యాన్ని కోస్తాయి.

రెండు దశాబ్దాలక్రితం వరకూ కూడా, గ్రామసీమల్లో ఒక విదేశీ అద్భుతంగా వుండేది. ఈ శతాబ్దపు నాలుగో దశాబ్దం ప్రారంభానికి సంబంధించిన యీ దిగువ చిత్రం, రైతులు తొలి ట్రాక్టరును ఎంతటి సంభ్రమాశ్చర్యాలతో చూస్తున్నారో తెలియజేస్తుంది. ఆబాలగోపాలం పొలానికి వచ్చేశారు, యీ అద్భుత యంత్రాన్ని — "ఇనుప గుర్రా"న్ని — తమ చేతులతో తాకి చూడదానికి.

---

చదవటం, వ్రాయటం నేర్చుకుంటూ (ఉజ్బెకిస్తాన్) పైనుండి రెండవచిత్రం

కోసిన పంటను తీసుకొంటోన్న దృశ్యం (మధ్య)

గ్రామానికి వచ్చిన మొట్టమొదటి ట్రాక్టర్ను పరిశీలిస్తోన్న ఒక వృద్ధ రైతు. 1926 (క్రింద)



నేటి అముర్‌నదీ తీరపు కొమ్సొమోల్స్క్ నగరపు స్థలంమీద, మారుమూల తైగాలో, 25 ఏళ్ళ క్రితం వేయబడిన మొదటి దేరాలను చూపుతుంది, పైనుంచిరెండవచిత్రం. ఈ బ్రహ్మాండమైన అధునాతన నగరం(పై చిత్రం) యిది నేటి అముర్ నదీ తీరపు కొమ్సొమోల్స్క్‌ను చూపుతుంది—వేనవేల జనాభాతో, ఫాక్టరీలు, పరిశ్రమలు, నాటక శాలలు, పాఠశాలలు, పార్కులతో, అక్షరాలా కొద్ది సంవత్సరాలలో అముర్‌నది తైగా తీరంమీద వృద్ధి అయ్యింది. దీనిని కొమ్సొమోల్స్, కీర్తినీయులైన సోవియట్ యువజనులు నిర్మించారు. వారిపేరు దీనికి పెట్టబడింది.

చాలా కొత్తనగరాలు, ఫాక్టరీలు, మిల్లులు, విద్యుత్కేంద్రాలు, నలభై సోవియట్ సంవత్సరాలలో వెలిశాయి. శ్రామిక ప్రజల జీవన పరిస్థితులు అపారంగా అభివృద్ధి చెందాయి.

ఇదంతా తేలికగా జరిగిపోయిందనుకుంటే పొరపాటు చేసినవాళ్ళమవుతాము. పైగా ఇది అపారమైన శ్రమఫలితం. భావినగర స్థలంలో వేసిన దేరాలు నవ్యతను కల్పించడానికి చేసిన పనికాదు. కఠినమైన తైగా ప్రాంతాలకు వచ్చి, యీ దేరాలలో జీవించవలసి వచ్చిన బాల యువకుల పరాక్రమ ఫలితం యివి.

పంచవర్షప్రణాళికల తొలి పరిశ్రమ అయిన మాగ్నితోగోర్స్క్ పరిశ్రమను నిర్మించ ప్రారంభించినవారు, ఒక పాతిక సంవత్సరాల క్రిందట జీవించవలసి వచ్చిన, పని చేయవలసివచ్చిన కఠిన పరిస్థితులను చూపుతుంది, దిగువ చిత్రం. వారు గోతుల్లో జీవించారు, నేలమీద త్రవ్విన గోతుల్లో తమ భోజనం వండుకున్నారు.



కాని నిర్మాతలు ఎన్నడూ ధైర్యాన్ని కోలుపోలేదు. వారి ముఖాలెప్పుడూ మందహాసాలతో వెలిగేవి. భవిష్యత్తులో తమ శ్రమకు, తాత్కాలిక కష్టాలకూ వందరెట్లు ప్రతిఫలం వస్తుందని వారెరుగుదురు; వారనుకున్నది నిజంకూడా. అతిసుందరమైన కుడివేపు దిగువ చిత్రం లోహ నిర్మాతల ఆరోగ్య మందిరం. ఇది మాగ్నితోగోర్స్క్‌లో, పూర్వం దేరాలుండిన స్థలంలో వెలిసింది. అత్యంత ప్రశస్తమైన వైజ్ఞానిక సామగ్రిగల యీ సుఖవంతమైన ఆరోగ్య మందిరంలో కార్మికులు ఉచితంగాగాని, అతి స్వల్పమైన వ్యయంతోగాని విశ్రాంతి తీసుకుని, ఆరోగ్యాన్ని పెంపొందించుకుంటారు. సోవియట్ దేశంలో యిటువంటి ఆరోగ్య మందిరాలు వేలాదిగా నిర్మించబడ్డాయి. మా కార్మిక కర్షకుల స్వార్థరహిత కృషికి నిజమైన స్పష్టమైన ఫలితాలలో యిదొకటి.

అమూర్ తీరపు కొమ్సొమోల్స్క్ (పైన)

మాగ్నితొగొర్స్క్‌లోని లోహ పరిశోధక కార్మికుల ఆరోగ్యమందిరం. (క్రింద)

మాగ్నితొగొర్స్క్‌లో అక్టోబర్ విప్లవానంతర ప్రథమ దినాలు. (క్రింద మధ్య)







## విప్లవ వినాదాలు నిజమయ్యాయి



# దున్నేవానికే భూమి

లిదియా తమరోవస్క్యయా







తమరోవ్స్కి సమిష్టి క్షేత్రాధ్యక్షురాలు, క్రాస్నాదోర్ మండలం

"అమ్మా, వ్యవసాయకూలీ అంటే ఎవరు?" అని నేను ఆ పదాన్ని గురించి మొట్టమొదటిసారిగా ఒక పుస్తకంలో చదివినప్పుడు మా అమ్మను అడిగాను.

"మన పొలాల్లో ఇప్పుడు వ్యవసాయ కూలీలు పనిచేయడం లేదు గాబట్టి, వ్యవసాయ కూలీ అంటే ఎవరో చూపలేను," అన్నది అమ్మ. "ఒకప్పుడు నేనే వ్యవసాయ కూలీగా పని చేస్తుండేదానిని ఎండనక, వాననక వెన్నెముక విరిగేటట్టు పొలంలో పని చేస్తుండే దానిని. అంతకష్టపడి నాట్లువేసి, గింజలు నూర్చినా, ఆ భూమి నాది కాకపోవడంచేత ఆ ధాన్యం నాకు చెందేదికాదు. బ్రతికి వుండడానికి సరిపోయేపాటి ధాన్యం మాత్రం ఇవ్వబడేది. అంతే."

నేను పుట్టిన గ్రామం మా స్వంత గ్రామంకాదని చిన్నదానిగా వున్నప్పుడు నేను మా అమ్మనుంచి తెలుసుకొన్నాను.

మా తండ్రి అసలు రైతు కాదు. యువకుడుగా వున్నప్పుడు ఒక సముద్రపురేవు పట్టణంలో కళాసీగా పనిచేస్తూ వుండేవారు. కాని అది చాలాకాలం క్రితం మాట. నేను పుట్టడానికి చాలా సంవత్సరాల క్రితమే మానాన్న మాసమిష్టి వ్యవసాయక్షేత్రానికి అధ్యక్షులయ్యారు. పిల్లలమైన మాకు, విప్లవానికీ, అంతర్యుద్ధానికి సంబంధించిన కథలను చెబుతుండేవారు. తీవ్రమైన పోరాటంద్వారా సామ్రాజ్యవాదులూ, శ్వేతదళాలు ఏ విధంగా ఓడింపబడినదీ, ఆ తర్వాత వారికి ఏ విధంగా భూమి ఇవ్వబడినదీ ఆయన మాకు తెలియజేస్తుండేవారు.

"ఐతే, ఆ భూమిని సేద్యం చెయ్యడం మొదలు పెట్టారన్న మాట?" అంటూ మేము అడిగేవాళ్ళము.

"ఎట్లా సాధ్యమవుతుంది?" అనేవారాయన చిరునవ్వు నవ్వుతూ. "వ్యవసాయ కూలీలకు చేతులు తప్ప సేద్యం చేయడానికి పనికరాలేముంటాయి? లెనిన్ మాకు యీ విధంగా ప్రబోధించారు: వ్యక్తిగతంగా మీరు దారిద్ర్యాన్ని జయించలేరు. ఈ మాటలను విన్న మేము ఏకం కావడానికి నిర్ణయించుకున్నాము. అది విప్లవం జరిగిన నాల్గు సంవత్సరాల తర్వాత మాట. మేము ఏడుగురము ఈ ఉపనది తీరానికి చేరుకున్నాము. మాలో ఎవ్వరికీ గుర్రాలు లేవు."

ఆ యేడుగురికి విత్తనాలను, గుర్రాలను, నాగళ్ళను యిచ్చి సోవియట్ ప్రభుత్వం ఏ విధంగా తోడ్పడిందో మానాన్న చెప్పారు. నింపాదిగా ప్రక్క గ్రామాల బీద రైతులు, వ్యవసాయ కూలీలు వారితో చేరారు. జీవితం సుఖవంతం కాసాగింది.

మా నాన్న క్రాస్ని దోమెత్స్ (ఎర్రయోధులు) సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి 26 సంవత్సరాలపాటు అధ్యక్షులుగా వుంటూవచ్చారు. భూస్వామియొక్క సగం శిథిలమైపోయిన గృహం సమీపంలో రాతితో కట్టబడిన గృహాలు వెలిసాయి. దానిచుట్టూ చక్కని ఉద్యానవనాలు లేచాయి, పెద్ద ధాన్యపు గిడ్డంగులు, ఒక కర్మాగారము, విద్యుత్కేంద్రము గ్రామం బయట నిర్మింపబడ్డాయి. సమిష్టి వ్యవసాయ రైతులు సమృద్ధివంతమైన పంటలను పండించుకొంటూ, స్వేచ్ఛాపూరిత జీవితాన్ని గడుపసాగారు. ఒక చక్కని బాలోద్యానవనాన్ని స్థాపించుకొన్నారు. ఆ తానికి పాఠశాల నొకదానిని నిర్మించుకొన్నారు. మా చెల్లెళ్ళు, తమ్ముడు, నేను ఆ పాఠశాలలోనే చదువుకొన్నాము. అక్కడి విద్య పూర్తయిన తర్వాత కళాశాలకు వెళ్ళాము. ఒక్క మాటలో చెప్పాలంటే జీవితం ఎంతో సౌఖ్యవంతంగా వుంటున్నది. జీవితం "స్వర్గతుల్యం గానంతగా మారిపోయింది"ని అమ్మ అంటుంది.

కాని ఇదంతా అనాయాసంగా మాత్రం జరుగలేదు. వ్యక్తులైతే సులభంగా పరిష్కరించుకొని వుండవలసిన అనేక కష్టాలను, సమిష్టి వ్యవసాయక్షేత్రం విజయవంతంగా పరిష్కరించుకొన్నది. యుద్ధంలో పూర్తిగా విచ్ఛిన్నమైపోయిన మా సమిష్టి వ్యవసాయ క్షేత్రం, యుద్ధం ముగిసిన మూడు సంవత్సరాలలోపలనే తిరిగి యథాస్థితికి వచ్చింది. నిజానికి అది, క్యూబాన్‌లోని అత్యంత సౌభాగ్యవంతమైన సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో ఒకటిగా తయారయింది.

మా నాన్న నన్ను వ్యవసాయ శాస్త్రజ్ఞురాలినై తాను పోరాడి సంపాదించుకొన్న భూమిని ప్రేమించమని కోరడంచేత నేను కళాశాలలో చేరాను.

మా నాన్న మరణానికి రెండు సంవత్సరాలముందు సమిష్టి వ్యవసాయక్షేత్రం 25 వ వార్షికోత్సవాన్ని జరుపుకొన్నది. ఆ ఉత్సవానికి వందలాది అతిథులొచ్చారు. ఆ సమయంలో మా నాన్న తన చిన్ననాటి సంగతులను గురించి, యుద్ధాన్ని గురించి, మొదటిరోజుల్లో సమిష్టి వ్యవసాయక్షేత్రం ఎదుర్కొన్న కష్టాలను గురించి తలుచుకొంటుండేవారు. ఆస్తి అన్నదేమీలేక ఒకప్పుడు కూలీగా పని చేసిన వ్యక్తి సమిష్టి వ్యవసాయోద్యమంలో ఒక ప్రముఖ నాయకుడు, సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ సభ్యుడు అయ్యాడు.

"మనకున్న యంత్రాలతోను, మనుష్యులతోను పదిరెట్లు అధికంగా ఉత్పత్తిచేయాలి," అంటుండేవారు మా నాన్నగారు. "మీ తరం వారు ఇంకా బాగా పనిచెయ్యాలి. ముందు ముందు మీకు యింకా యెక్కువ అవకాశాలు లభిస్తాయి. అందువల్ల కష్టపడి చదువుకో."

నాన్న హఠాత్తుగా చనిపోయారు. ఒకనాడు వసారాలో నిలుస్తూ, గుండె అదిమిపట్టుకొని తూలిపోయి మెట్లమీదినుంచి పడిపోయారు.

ఆయన మరణానంతరం సమిష్టి వ్యవసాయక్షేత్రానికి ఆయన పేరు పెట్టబడింది. ఇప్పుడది వి. ఎన్. తిమురోపిస్కి సమిష్టి వ్యవసాయక్షేత్రమని పిలువబడుతున్నది.

నాలుగు సంవత్సరాలై మా తండ్రి పేరుపెట్టబడిన ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రానికి నేను అధ్యక్షురాలుగా ఉంటున్నాను. ఎలాంటి



నల్ల నేలల మధ్యప్రాంతంలోని, ఛెగొంకీ గ్రామంలోని ఒక సమిష్టిక్షేత్ర సభ్యత్వానికి రైతులు దరఖాస్తులిన్న దృశ్యం (1931)

★

కలినోవ్కా సమిష్టిక్షేత్ర సభ్యులు. (లగోదెఖీ మండలం, జార్జియన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్) పొలాలలో పొగాకు నాట్లు వెయ్యడానికి మూకుమ్మడిగా వెళ్ళుతోన్న దృశ్యం. 1930.





మెషీన్-ట్రాక్టర్ స్టేషన్లోని ఒక మెయిన్టెనెన్స్ షాపులో
(తామరొవ్‌స్కీ సమిష్టి క్షేత్రం)

అనుభవమూ లేకుండా ఇంతటి బాధ్యతను స్వీకరించడానికి నాకు ధైర్యం ఎలా కలిగిందని తరుచు అడుగుతుంటారు. మా నాన్న పాతిక సంవత్సరాలపాటు యీ సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అధిపతిగా వున్నారు అంటూ ఆయనను అర్థం చేసుకొని, ముందు చెప్పకుండా ఆయనమాటను శిరసావహించేవారు. నాకున్నదల్లా కళాశాల విద్యాభ్యాసం మాత్రమే. ఐతే నాకీ ధైర్యం యెలా వచ్చింది? ఎవరిమీద ఆధారపడ్డాను?

సమిష్టి వ్యవసాయక్షేత్రం సభ్యులపైన దాదాపు ముప్పై సంవత్సరాలబట్టి వాళ్లు అక్కడ కలసి పనిచేస్తున్నారు. వారు ఒక అద్భుతమైన పాఠశాలలో శిక్షణను పొందారు. ప్రజల ఆస్తిని తమ స్వంత ఆస్తిలాగ చూచుకోవడం నేర్చుకొన్నారు. దానిపైననే ఆధారపడ్డాను. నేననుకొన్నది తప్పుకాలేదు.

నేను అధ్యక్షురాలినై నాలుగు సంవత్సరాలయింది. మేము సాధించిన విజయాలివి: మా పనియొక్క స్థాయి పెరిగింది. పంట అధికమయింది. సేద్యంలో వైజ్ఞానిక పద్ధతులు అధికంగా ఉపయోగింపబడుతున్నాయి. మా సాలీనా ఆదాయం ఇరవై లక్షల రూబుల్లను

మూర్దేవియా సమిష్టిక్షేత్రాలలోని ఒక సమిష్టిక్షేత్రంలో వసంతపు విత్తు చల్లడం





కామరొవ్‌స్కీ సమిష్టిక్షేత్ర గ్రంథాలయంలో

మించి ఉంటున్నది. ఇప్పుడు మేము నాలుగు సంవత్సరాల క్రితం కంటే మూడురెట్లు అధికం పాలను, నాలుగురెట్లు అధికం మాంసాన్ని ఉత్పత్తి చేస్తున్నాము. ఈ మధ్య గడిచిన సంవత్సరాలలో, దేశమంతటా అద్భుతమైన మార్పులు సంభవించి వుండడంచేత ఇది సాధ్యమయింది. పరిశ్రమలు అభివృద్ధిపొంది మా కవసరమైన యంత్రాలను తయారుచేస్తున్నాయి. ప్రభుత్వం ఇంకా సౌభాగ్యవంతమయింది. అందువల్లనే అది కొనుగోలు ధరలను అధికం చేయగలిగింది. మా పాలకు, మాంసానికి, ధాన్యానికి, కూరగాయలకు ఇప్పుడు పూర్వంకంటే యెక్కువ ధర లభిస్తున్నది, సహజంగానే ఇప్పుడు మేము నిర్మాణాలను ఇంకా యెక్కువగా జరిపించగలం సభ్యులకు ఇంకా యెక్కువ డబ్బివ్వగలం.

ప్లానింగు విధానం బాగా అభివృద్ధిని పొందింది. మొక్కజొన్న మొదలైన పశుగ్రాసపు పంటలు, బ్రాషికొటలు అధికంగా వేస్తున్నాము. నాలుగు సంవత్సరాల క్రితం ప్రభుత్వం పన్నులను బాగా తగ్గించింది. ఈ సంవత్సరం ప్రారంభంనుండి స్వంత పొలాలలో పండించుకొనే వస్తువులలో యేమీ ప్రభుత్వానికి ఇవ్వ

కుబాన్ ఖనిశాల క్షేత్రాలు (వమ్మత్ ఇల్యిచా



...నకొంతలేకుండా చేయబడింది. యుద్ధంలో 1 లక్ష ముఖ్యం పోయాము.

కాని ఇంతకంటే ఎక్కువ గూడా చేయగలం. ఇలా మేము ఊహించుకుంటుండగా విన్నాయేమోనన్నట్లుగా, సోవియట్ ప్రభుత్వము, కమ్యూనిస్టుపార్టీ, పాలు, వెన్న, మాంసాల తలాక్కింటి ఉత్పత్తిలో అమెరికాను మించాలన్న కర్తవ్యాన్ని మాముందుపెట్టాయి.

ఈ వసంతకాలంలో మా అంచనాలను తయారుచేసుకొన్నప్పుడు మేము బాగానే ముందుకు సాగిపోతున్నామని గ్రహించాము. పాల ఉత్పత్తికి సంబంధించినంతవరకు అమెరికా స్థాయిని అందుకొన్నాము. గత సంవత్సరం మా సమిష్టి వ్యవసాయక్షేత్రం ప్రతి వంద హెక్టర్ల భూమికి 20 టన్నుల పాలను ఉత్పత్తి చేసింది.

మాకున్న వాతావరణ పరిస్థితులలాంటివాటినే కలిగివుంటున్న అయోవా రాష్ట్రం ఉత్పత్తికంటే ఇది యెక్కువ. పైగా అయోవా యుద్ధాలకు గాని, వినాశనానికిగాని గురియైవుండలేదు.

మాంసం విషయం వేరు. దానికొరకు ఇంకా కష్టపడి పని చేయవలసి ఉంటుంది. కాని ఆ విషయంలో గూడా వాళ్ళస్థాయికి చేరుకొంటాము.

మానాన్నగారి కాలం మొదలుకొని ఇప్పటివరకు యెన్ని మార్పులు వచ్చాయి! నా కాలంలోనే ఎన్నో అద్భుతమైన మార్పులు జరిగాయి. మా పశుసంపద బాగా అభివృద్ధి పొందింది. విద్యుత్ యంత్రాలతో పాలను తీస్తాము.

పొలాల్లో ఇప్పుడు గుర్రాలు లాగే నాగళ్ళు కనబడవు. పొలాల్లోకిపోయి చూచినట్లయితే యంత్రాలధ్వని నిరంతరం వినబడుతూ ఉంటుంది. పొలంపనిలో అత్యధికభాగం యంత్రాల ద్వారానే జరుగుతున్నది.

మా పొలాలు దున్నేవాళ్ళు, విత్తుజల్లేవాళ్ళల్లో గూడా మార్పు కనబడుతుంది. నేడు మా పొలంపనివారు, ట్రాక్టర్-డ్రైవర్లూ, కంబైన్ ఆపరేటర్లు విద్యావంతులు. వారికి యంత్రాల గురించి

గొప్ప శాస్త్రీయ జ్ఞానం ఉంది. యంత్రాలను ఎలా ఉపయోగించాలో వారికి తెలుసు.

ఇప్పుడు సమిష్టి వ్యవసాయదారులు పూర్వంకంటే సౌభాగ్యవంతమైన జీవితాన్ని గడుపుతున్నారు. ప్రతి ఇంట్లోను రేడియో, పుస్తకాలు, వార్తాపత్రికలు కనబడుతాయి. విశాలమైన ఇళ్ళు బలంగా నిర్మింపబడుతున్నాయి. పనిచేయడం సాధ్యంగాని వృద్ధాప్యం వచ్చినవారికి సమిష్టి వ్యవసాయక్షేత్రం వృద్ధాప్యపు పెన్షన్‌ను ఇస్తున్నది.

అవును, చాలా మార్పులు జరిగాయి, ఇంకా చాలామార్పులు జరుగుతాయి. దానికన్నా ఒక్కటే అవసరం—యుద్ధాలు లేకుండా ఉండటం, ఒక్క మాటలో చెప్పాలంటే శాంతికావాలి. అది లభించితీరుతుందని మా నమ్మకం.



తామరొవెన్స్కీ సమిష్టిక్షేత్రపు విద్యుత్కేంద్ర కంట్రోల్ పానెల్‌వద్ద

క్షేత్రం,(క్రాస్నొదార్ మండలం)

వొలొగ్డా పాడి-పశు ప్రాయోగిక విభాగంలోని ఒక పాడి ఆవుల మంద





శ్రీ

ఏలుకొలది చూచినాను
బోలెడంత ప్రపంచాన్ని
ప్రపంచాన ప్రభవించిన
సకలవస్తు సంచయాన్ని

సకలవస్తు సముదాయము
బ్రతుకు విరియు కొరకున్నది
బ్రతుకు హాయిగా ఉన్నది
బ్రతుకు బలే బావున్నది

కాని ఇచట మా పనిలో
ఊపిరాడనంత జోరు
హైలెస్సా బైలెస్సా
మరో ఇంత పోరు హోరు

పరుచుకొంది ఒక ఇంటికి
పాము మెలికలా బజారు
ఆ బజారు నాది; నేనె
ఆ యింటికి స్వంతదారు

పంచభక్ష్య పాయసాలు
ఫలాలు మధురాసవాలు
నింపి నిబిడమై ఉన్నవి
దారుతీరి దుకాణాలు

సన్నని వలిపెముల వెనుక
తరిపిజున్ను వెన్న పాలు
"తగ్గించిన ధరలు" అనుచు
మెరుపుతీగ అక్షరాలు

నా సహకార సమాజము
వాసిగ పనిచేస్తున్నది
పైనపైన పోగుచేసి
బలేబలే బావున్నది

బొత్తులు బొత్తులు పేర్చిన
పుస్తకాల పుటలపైన
నా పేరే రచిస్తాను
కెంపులీను కవితలో:

మనసుహాయి కొల్పుతోంది
నారచనలు, నాకృతులవి
నాప్రభుత్వ కృతిలో శ్రుతి
కలిపి లీనమవుతున్నవి

ధూళిచిమ్ము రబర్ టైర్లు
అది నా మోటారుకారు
నాప్రతినిధులందులోన
సభాస్థలికి వెళ్లుతారు

మామాస్కో సోవియట్టు
అదె ఆ ఎర్రని భవంతి
చర్చ జరుపుతారు అచట
మచ్చరికం నమ్మరంతి

విరిసిన కెందామరలా
మెరిసే ఆననముచూడు
ఆ రివాల్వరాఫీసరె
మా రక్షకదళమువాడు

కంటిరెప్ప మాదిరిగా
కాపాడును నిరంతరము
మారక్షకదళమువాడు
నన్ను, నా సర్వస్వము

అదే నవ్యమార్గమ్మని
చేతికోల చెపుతున్నది
నవ్యంగా నడుస్తాను
బలేబలే బావున్నది

నీలిపట్టుకుచ్చులాంటి
నిర్మల మృదులాకాశము
ఇంత అందమైన బ్రతుకు
ఏనాడూ మరి కానము

ఆకసాన విమానాలు
ఝుమ్మని చేస్తున్నవి రొద
విమానాలు నడుపువారు
అందరు నావారే కద!
హరిచందన వృక్షంలా
శిరసు ఎత్తి నిలిచినాను
పై వారం నా పగతుర
బలం పటాపంచలౌను

కృతి:

వి. మాయకోవస్కీ

ఇదో ఇదే కుడిరట్టున
ఏగు చమూసమూహమ్ము
ధిమిధిమిధిమి ధింధిమ్మని
మ్రోగు వీర మద్దళమ్ము

కదం ఒత్తి శిరస్సెత్తి
దేశరక్షకోసం పది
నూరాయుధములు బట్టిన
అరుణతార వాహిని అది!

నలుగురు నలుగురుగా నడ
కదంకదం లయకు ఒదుపు
నాశత్రువే నీశత్రువు
నీశత్రువె నాశత్రువు!

వస్తున్నారేటివారు?
రానీ! చాలామంచిది
వారినిటే ఆపుదాము
ఆపుట చాలామంచిది

చకచక తిరిగే ఇంజను
నాకారులు ట్రాక్టరులు
అన్నురన్ను పనిపాటులు
ప్రతిరణించు ఫ్యాక్టరీలు !

హుషారు యంత్రాల్లారా !
మరవకండి మీధ్యేయం
మా యువ కమ్యూనిస్టులకు
నేయవలెను కౌశేయం

వనతరుతతి వెలువడి దక్షిణ పవనము వీస్తున్నది
గాలి పరిమళిస్తున్నది
బలే హాయిగా ఉన్నది

పట్టణాని కర్రాపల
పరిచిన పచ్చికబయళ్లు
ఆ పచ్చికబయళ్ళలో
అందమైన చిన్న యిళ్ళు

చిన్నచిన్న ఇళ్ళల్లో
ఉన్న పంటసిరిబిడ్డలు
పేచుగడ్డములు, ఏపుగ
పెరిగిన కాబేజ్ గడ్డలు

నెగడువద్ద చేరి అయ్యొ
సెగకాగును వీడిడిగులు
వారంతా తమ పనిలో
అతిరథులూ మహారథులు

కన్నెనేల దున్నుతారు
కవితను పండించుతారు
తెలవారకమునె మేల్కొను
తేనెటీగలాంటివారు

విత్తనాలు చల్లుతారు
నాకువండి వార్చుతారు
నేలలన్ని దున్నుతారు
ఆలపాలు పితుకుతారు

కొలనులలో గండుమీల
వలలువేసి పట్టుతారు
మా నూతన రిపబ్లిక్కు
సిరిసంపద పెంచుతారు

ఇతరేతర జీర్ణభూము
లేనాడో జవచెడినవి
వాటిబ్రతుకు వాటిచరిత
రుద్రభూమిలా గున్నవి

కాని నవనవోన్మిష ప్రతిభోజ్వల యువభూమి మాది
ఇచట ధీరతకు ఊహకు
కల్పనలకు జరుగు ప్రోది

సంతోషము జాలువారు
దోసిలొగ్గి జుర్రుకొనుము
ఇచట బ్రతుకు మహాద్భుతము
అతిసుందర మానందము

జరాదుజలు మమ్మంటవు
జీవామరదశ్శతము
ఏటికేడు గడుచుకొలది
మా ప్రతిభలు పరశ్శతము

కర్మతిపట్టిన సుత్తిని
కవిత్వాన్ని ప్రస్తుతింతు
అభ్యుదయ పరంపరాభి
వర్ధమాన భువి నుతింతు !

'అక్టోబర్' అన్న కావ్యం నుండి.



అనుకృతి : రా. కృష్ణమూర్తి

## ఆచరణలో అక్టోబర్

# ప్రజలకు

బ్రతకడానికి మానవుడికి గాలి అవసరం. అదేవిధంగా ఒక జాతి జీవించడానికి స్వాతంత్ర్యం అవసరం. గాలి లేకపోతే మానవుడు చనిపోతాడు, స్వాతంత్ర్యం లేకపోతే జాతి క్షీణించి పోతుంది. అందువల్లనే అన్నిజాతుల ప్రజలు స్వాతంత్ర్యంకోసం తహతహలాడుతారు. బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాడని జాతి వుండదు. ఇలాంటి పోరాటాల సుదీర్ఘ చరిత్రే ప్రపంచ చరిత్ర. ఈ పోరాటం ఇంకా పూర్తికాలేదు. ప్రపంచమంతటా వివేకము, న్యాయము విజయం పొందేవరకు ఇది కొనసాగుతూనే వుంటుంది. కాని అలాంటి సమయం ఎన్నటికైనా వస్తుందా? వచ్చి తీరుతుంది. అప్పుడే సమస్త జాతులు తమ జీవితాలను నిర్మించుకొంటూ, తమ సంప్రదాయాలకు, జీవిత విధానాలకు, ఆకాంక్షలకు అనుగుణ్యమైన తమ జాతీయ సంస్కృతిని రూపొందించుకొనగలుగుతాయి. ఇది సాధ్యం, జాతుల సమస్య పరిష్కరింపబడగలదు, అన్న విషయం, సోవియట్ దేశ అనుభవాలవల్ల విస్పష్టంగా వెల్లడవుతుంది.



నలభై సంవత్సరాల క్రితం రష్యాలో జరిగిన అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం జాతుల పీడనను శాశ్వతంగా అంతమొందించింది; రష్యన్ సామ్రాజ్యంలో వుంటూవచ్చిన వివిధ జాతుల ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, సమాన హక్కులను చేకూర్చింది. 1917 నవంబరులోనే సోవియట్ ప్రభుత్వం, రష్యా వివిధజాతి ప్రజల హక్కుల ప్రకటనలో, రష్యాలోని వివిధజాతుల ప్రజల సమానత, సర్వ సత్తాధికారాలను, విడిపోయి, స్వతంత్ర రాజ్యంగా యేర్పడే హక్కుతోపాటు స్వయం నిర్ణయాధికారాన్ని ఉల్లేఖించింది.

నేను లెత్‌లు అనే రష్యాలోని ఒక చిన్నజాతికి సంబంధించిన ప్రతినిధిని. మా జాతి జనాభా ఇరవై లక్షలకు ఇంకా తక్కువే వుంటుంది. కాని దాని చారిత్రక భవితవ్యం, సోవియట్ల భూమిలోని ఇతర చిన్నజాతులన్నిటి భవితవ్యానికి స్వాభావికమైనది.

ఈ లెత్ జాతివారు మొట్టమొదటగా భారతదేశంనుండి వచ్చి ఉంటారని చరిత్రకారులూ, భాషా శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుతున్నారు. లెత్‌జాతి ప్రజల భాషకూ, ప్రాచీన సంస్కృతానికి చాలా పోలికలున్నాయి. మా ప్రాచీనులు కొన్నివేల సంవత్సరాల క్రితం బాల్టిక్ సముద్రతీరానికి వచ్చి అక్కడ స్థిరపడిపోయారు. ఏడు శతాబ్దాలకంటే యెక్కువ కాలానికిపూర్వం పశ్చిమాన్నుండి వచ్చిన శత్రువులు, జర్మన్ కృపాణధారులు (ట్యుటోనిక్ నైట్లు) వారిపై దాడి జరిపారు. తీవ్రము, సుదీర్ఘము అయిన పోరాటం తర్వాత చివరికి లాత్వియన్ ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని గోల్పోయారు. బానిసత్వపు భయంకర స్వప్నంయొక్క ప్రారంభం అదే. జర్మన్ భూకామందుల చేత లెత్‌లు పీడింపబడుతూ, చిత్రహింసలకు గురికావింపబడి, దోచుకొనబడుతుండేవారు. వివిధకాలాల్లో వివిధజాతుల ప్రజలు లెత్‌లను తమలో కలిపివేసుకోవాలని ప్రయత్నించారు. జర్మన్లు వారిని జర్మన్లుగా మార్చివేయాలని చూశారు. పోలిష్ జాతివారు వారిని పోలిష్ జాతి వారినిగా తయారుచేయాలని చూచారు. జారిస్టు నిరంకుశపాలన వారిని రష్యన్లుగా చేయాలని తీవ్ర ప్రయత్నం చేసింది. కాని యీ ప్రయత్నాలవల్ల యేమీ జరుగలేదు. లెత్‌లు ఒక జాతిగా ఉండనే వున్నారు. జారిస్టు రష్యాలోని ఇతరజాతుల ప్రజలకువలెనే స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల లేమివారి పురోభివృద్ధికి ఆటంకమవుతూ వచ్చింది. అక్టోబరు విప్లవం ఈ స్వాతంత్ర్యాన్ని, జాతీయాభివృద్ధికి అవకాశాలను కల్పించింది. ఈ విప్లవం వివిధజాతుల ప్రజలకు యుగ యుగాల బానిసత్వాన్ని తొల



విప్లవ నినాదాలు:

# స్వాతంత్ర్యం!

ఎ. లాసిస్
లాత్వియన్ రిపబ్లిక్కు మంత్రివర్గాధ్యక్షుడు, సోవియట్ దేశ
సుప్రీం సోవియట్ జాతుల సోవియట్ అధ్యక్షుడు

గించింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, సమానత్వాన్ని చేకూర్చింది. అన్ని రకాల జాతీయ, జాతీయ-మత ప్రత్యేక సౌకర్యాలను, నిర్బంధాలను రద్దు చేసింది.

సోవియట్ ప్రభుత్వం మొట్టమొదటినుండి, అన్ని జాతుల ప్రజలు ఒక కుటుంబపు సమానహోదా సభ్యులుగా వుండే, జాతుల సోదర సమాఖ్యను సృష్టించడానికి ప్రయత్నం చేస్తూ వచ్చింది. లెనిన్ ఈ విధంగా వ్రాసారు. "మనకు ఐచ్ఛికమైన జాతుల సమైక్యత, ఒకజాతి మరొకజాతిని పీడించడం యేమాత్రమూ సహించని



ఐక్యత, సంపూర్ణ విశ్వాసం, సోదర ఐక్యతపట్ల చైతన్యం పూర్తిగా ఐచ్ఛికమైన ఒడంబడికపైన ఆధారపడి వున్న ఐక్యత. కావాలి" ఇలాంటి సమాఖ్య స్థాపింపబడింది. సంపూర్ణ సమాన హక్కులను కలిగిన పదిహేను రిపబ్లికులతో కూడిన, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల సమాఖ్య అదే.

కాని ఆ సమయంలో సోవియట్ లాత్వియా యెంతోకాలం నిలవలేదు. జర్మన్, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సహాయంతో ప్రజాస్వామ్య వ్యతిరేకశక్తులు నూతన సోవియట్ ప్రభుత్వాన్ని రక్తపాతంలో ముంచివేసి, లాత్వియాను సోవియట్ల దేశం నుండి ఊడదీయగలిగాయి. ఇరవై సంవత్సరాలపాటు లాత్వియా పశ్చిమ సామ్రాజ్యవాదదేశాల తాబేదారులచేత పరిపాలింపబడింది ప్రజలను దోచుకొని, దేశాన్ని నాశనం చేస్తూవచ్చారు.

చిట్టచివరికి లాత్వియా ప్రజలు (లిథూనియా, ఇస్తోనియా ప్రజలవలెనే) 1940లో జాతీయవ్యతిరేక ఫాసిస్టులను కూలద్రోసి, సోవియట్ ప్రభుత్వాన్ని స్థాపించి, సోవియట్ సమాఖ్యలో పునరైక్యం కావడంలో విజయవంతులయ్యారు. తక్షణమే జాతీయార్థిక, సాంస్కృతిక రంగాలన్నింటిలో త్వరిత గతిని అభివృద్ధి కలుగసాగింది. ఎంతో ఉత్సాహంతో తమ జీవితాన్ని నిర్మించుకొంటున్న లాత్వియన్ ప్రజల కృషికి రెండవ ప్రపంచ యుద్ధం అవరోధాన్ని కల్పించింది. హిట్లర్ మూకల ఆక్రమణతో ఈ రిపబ్లిక్‌కు బ్రహ్మాండంగా నష్టంకలిగింది. లాత్వియా అమానుషంగా దోచుకోనబడి. వినాశనం గావింపబడింది. తిరిగి పారిపోతున్న జర్మన్ ఫాసిస్టులు ఫ్యాక్టరీలను, విద్యుత్ కేంద్రాలను. వంతెనలను రైల్వే మార్గాలను ధ్వంసంచేస్తూ నగరాలను. గ్రామాలను పూర్తిగా నేలమట్టం చేశారు. దురాక్రమణదారులు తరిమివేయబడిన తర్వాత ప్రజలు దాదాపు అంతటినీ క్రొత్తగా నిర్మించుకోనవలసి వచ్చింది. ఈ విషయంలో మేము కొద్దికాల వ్యవధిలో నష్టాన్నంతటిని సరిచేసుకొనడమేగాక. అన్నిరంగాలలోను యుద్ధాత్పూర్వపు స్థాయికి చేరుకొన్నాము. సోవియట్ దేశంలోని వివిధ ప్రజలు ఇచ్చిన సహాయంవల్లనే యిది సాధ్యమయింది.

ప్రజల స్వాతంత్ర్యంతో, సోదర స్నేహం తోడ్పాటుతో యెలాంటి అద్భుతాలను సాధించవచ్చునో కొన్ని ఉదాహరణలను వివరించవచ్చును. సోవియట్ల పరిపాలనలో, రష్యా సరిహద్దుకోని

వెనుకబడిన ప్రాంతాలు ఫాక్టరీలధ్వనితోను, విద్యుత్‌కేంద్ర దీపాల వెలుగుతోను, ట్రాక్టర్లు, మోటార్ల సవ్వడితోను సజీవమయ్యాయి. పాఠశాలలు, జూనియర్ కళాశాలలు, ఇతర విద్యాసంస్థలు, విశ్వ విద్యాలయాలు ఆ ప్రాంతాల్లో ప్రారంభింపబడ్డాయి. 1913వ సంవత్సరం నాటి మొత్తం ఉత్పత్తితో పోల్చిచూచినట్లయితే, గత సంవత్సరపు మొత్తం ఉత్పత్తి తజిక్ రిపబ్లిక్‌లో 27 రెట్లు, జార్జియన్ రిపబ్లిక్‌లో 30 రెట్లు, కజక్ రిపబ్లిక్‌లో 36 రెట్లు, కిర్గిజియా రిపబ్లిక్‌లో 42 రెట్లు, ఆర్మీనియన్ రిపబ్లిక్‌లో 45 రెట్లు పెరిగింది.

సాంఘిక, సాంస్కృతికాభివృద్ధికూడా యిలానే జరిగింది. ఉదాహరణకు, విప్లవానికి పూర్వం తజికిస్తాన్‌లో ప్రతి 200 మందిలో ఒక్కరికి మాత్రమే చదువువచ్చేది. ఆ రోజుల్లో మొత్తం పది పాఠశాలలు మాత్రమే ఉండేవి. ఇప్పుడు తజిక్ రిపబ్లిక్‌లో మొత్తం 2,600 పాఠశాలలున్నాయి. 300,000 మంది యీ పాఠశాలలకు హాజరవుతున్నారు.

జాతులకు స్వాతంత్ర్యం ఒక గొప్ప అండ. వివిధ సోవియట్ ప్రజల సౌభ్రాతృత్వము, వారి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కొరకూ, భవిష్యత్ పురోభివృద్ధికొరకు అత్యంతావసరం.

తజిక్ నూనాయిపులు (పైన)

ఇటువంటి పరిశ్రమాగారాలు నడపడానికి ప్రజానులు చేశాయి. (ఎడమ, క్రింద)

ఒక తజిక్ తపాలా పనికత్తె. నలభై సంవత్సరాల క్రితం, ఆవిడ ఒక బురఖాను వేసుకుని వుండేది (కుడి, క్రింద)

నేటి ఉజ్బెక్ చేతికళల పనికత్తె

ప్రదర్శనాలయంలో. అజ్ఞానంవల్ల ఒకనాడు వెనుకబడిన ఆసియన్ రిపబ్లిక్కుల ప్రజలు నేడు, సర్వ సాంస్కృతికసౌలభ్యాలను పొందుతున్నారు(కుడి, దిగువ)

సకల పరికరాలున్న ఆసుపత్రులలో కార్మికుల ఆరోగ్యం గురించి ఎంతో శ్రద్ధవహింపబడుతుంది. ↓









# నలభై సంవత్సరాల విజ్ఞాన ప్రగతి

ఎకడమీషియన్
**ఎ. తొప్చియేవ్**

**1917** అక్టోబరు విప్లవం విజయవంతం కావడంతో విజ్ఞాన శాస్త్రంలో ఒక కొత్తశకం ప్రారంభమయింది. సోవియట్ దేశంలోని విజ్ఞానశాస్త్రం మానవుడు మానవుని బానిసనుగా చేసుకొని దోచుకోడానికి సాధన కాకుండా, మానవుడు ప్రకృతిని జయించడానికి ఒక సాధనగా, సమాజంయొక్క విప్లవాత్మక పునర్నిర్మాణానికి ఒక సాధనగా మార్చబడింది. అది మానవాళియొక్క మహోన్నతాదర్శాల సాధనకు ఉపయోగింపబడుతున్నది. దాని అభివృద్ధికి సోవియట్ దేశంలో అత్యంత అనుకూలమైన పరిస్థితులు కల్పింపబడ్డాయి.

ఈ మధ్య కృత్రిమ ఉపగ్రహం ఎగురవేయబడడం సోవియట్ విజ్ఞానశాస్త్రంయొక్క మహత్తర విజయాలకు నిదర్శనం. ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్తలు, తదితర ప్రముఖులు దీనిని వైజ్ఞానిక మహాద్భుతంగా హర్షించారు. అంతర్గ్రహ ప్రయాణాలకు మానవులు కంటున్న కలలు నిజం కావడానికి ఇది ప్రథమ సోపానమని వారు గ్రహించారు. అది అంతరిక్షానికి సంబంధించిన విజ్ఞానాన్ని పెంపొందజేసి, మూల వస్తువులకు సంబంధించిన అనేక సమస్యలను పరిష్కరించడానికి తోడ్పడుతుంది.

సోవియట్ దేశ ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి పథకాలు అత్యంతాధునిక వైజ్ఞానిక విజయాలకు ప్రాముఖ్యతనిస్తూ తయారు చేయబడ్డాయి. నూతన సోషలిస్టు ఆర్థిక విధానాభివృద్ధికి పునాదివేసిన ప్రఖ్యాత గొయిల్రో పథకం (రష్యా విద్యుదీకరణకు పథకం) ఇలాంటి దేశ పారిశ్రామీకరణకూ, వ్యవసాయం సమిష్టీకరణకూ వేయబడిన పథకాలూ, పంచవర్ష ప్రణాళికలూ ఇలాంటివే. అన్ని పంచవర్ష ప్రణాళికలలోను పారిశ్రామిక యంత్రాగారాల నిర్మాణానికేగాక, పరిశోధనా సంస్థలకు, ప్రయోగ కేంద్రాలకు, నూతనంగా తయారు చేయబడిన, కనుగొనబడిన పరికరాలు పరీక్షించే ప్రయోగ ఫాక్టరీలకు గూడా కేటాయింపులు జరిగాయి.

అక్టోబరు విప్లవ విజయానంతరం గడచిన నలభై సంవత్సరాలలోని సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు చరిత్ర, కొంతవరకు సోవియట్ విజ్ఞానశాస్త్ర సాధారణ చరిత్రను ప్రతిబింబిస్తుంది. జారిస్టు రష్యా పరిపాలకులకు విజ్ఞానశాస్త్ర పరిషత్తు ఒక యూరోపియన్ రాజ్యానికుండవలసిన అంశంగా తప్ప మరే ప్రాముఖ్యతనూ కలిగి వుండేదికాదు. ఇక విజ్ఞాన శాస్త్రంలో ఆసక్తి మాట, పరిశోధనల ఫలితాలమాట వ్యక్తిగత విజ్ఞానశాస్త్రవేత్తలపైన ఆధారపడి వుండేది. తత్ఫలితంగా, ఉన్నకొద్ది వైజ్ఞానిక పరిశోధనా సంస్థలూ, కొద్దిమంది విజ్ఞాన శాస్త్రవేత్తలూ, వారి పరిశోధనాలయాలూ, మ్యూజియంలూ నిరక్షరాస్యులయిన ప్రజలు, నిర్లక్ష్య భావంగల అధికారుల సముద్రం మధ్య ద్వీపాల్లాగ వుండడం జరుగుతుండేది. విప్లవం విజ్ఞాన శాస్త్రానికీ ప్రజలకూ మధ్యగల అడ్డును నిర్మూలించి, విజ్ఞానశాస్త్రాన్ని ప్రజల జీవితానికి సన్నిహితం చేసింది. విజ్ఞానశాస్త్ర దిఙ్మండలం విస్తృతంగావింపబడింది.

మొట్టమొదటినుంచి కూడా సోవియట్ ప్రభుత్వం విజ్ఞానశాస్త్ర పరిషత్తు పట్ల ప్రత్యేక శ్రద్ధను వహిస్తూ వచ్చింది. ఇంపీరియల్ ఎకాడమీ అని పూర్వం పిలవబడుతూ వుండిన ఈ అధికార సంస్థలోని విజ్ఞాన శాస్త్రవేత్తల్లో తమ పనిపట్ల ఆసక్తిగల నిజమైన విజ్ఞాన శాస్త్రవేత్తలను లెనిన్ కనుగొన్నారు. ఐ.పి. పావ్‌లోవ్‌పట్లా, అతని విజ్ఞానశాస్త్ర రచనల ప్రచురణలపట్లా, నిజ్నినొవొగొరోడ్ (ఇప్పటి గోర్కీ నగరం) లో ఆసక్తిదాయకమైన పరిశోధనలను జరుపుతూ వుండిన పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్త, ఇంజనీరు అయిన ఎమ్. ఎ. బోన్చ్-బ్రుయేవిచ్ పట్లా లెనిన్ ఎలాంటి శ్రద్ధను చూపుతూ వచ్చేరో అందరికీ తెలుసు.

లెనిన్ 1918 లో తయారుచేసిన "విజ్ఞానశాస్త్ర విషయిక, ఇంజనీరింగు పనులకు ముసాయిదా పథకం" అన్న ప్రఖ్యాత పత్రంలో విజ్ఞానశాస్త్ర పరిషత్తు కర్తవ్యాలు నిర్దేశింపబడ్డాయి. దేశాన్ని విద్యుదీకరణ చేయవలసిన ఆవశ్యకతను గురించి లెనిన్ నొక్కి చెప్పారు.

పంచవర్ష ప్రణాళికల కాలంలో సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు సోవియట్ విజ్ఞానశాస్త్రానికి కేంద్రంగా రూపొందింది. సోవియట్ ప్రభుత్వపు నలభై సంవత్సరాల కాలంలో పరిషత్తు ఉద్యోగుల సంఖ్య వందరెట్లకు పైగా పెరిగింది. వెయ్యిరెట్లకు పైగా బడ్జెట్టు పెరిగింది. 1917 లో వైజ్ఞానిక సాహిత్యం 627 ఫారములు మాత్రమే ప్రచురింపబడింది. 1956 నాటికల్లా ఈ ప్రచురణ 29,000 ఫారములకు పెరిగింది.

ఏయేటి కాయేడు పరిశోధనా సంస్థల సంఖ్యా, విజ్ఞాన శాస్త్రవేత్తల సంఖ్యా పెరుగుతూ వస్తున్నది. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి, దేశ ఉత్పాదకశక్తుల పరిశోధన, విజ్ఞాన శాస్త్రవేత్తల శిక్షణ మొదలైన విషయాల్లో స్థానిక వైజ్ఞానికసంస్థలు ప్రముఖపాత్రను వహిస్తున్నాయి. ప్రస్తుతం యూనియన్ రిపబ్లిక్‌లలోని పదమూడు విజ్ఞానశాస్త్ర పరిషత్తులు, సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తుయొక్క పదమూడు శాఖలు, ప్రత్యేక రంగాల్లో పరిశోధనలు జరిపే అనేక వైజ్ఞానిక సంస్థలు వున్నాయి.

అనేక వైజ్ఞానిక శాఖల్లో సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు ప్రముఖ విజయాలను సాధించారు. గత ఇరవై సంవత్సరాల కాలంలోను అన్ని వైజ్ఞానిక రంగాల్లోను ఘన విజయాలు సాధింపబడిన విషయం అందరికీ తెలిసిందే. ఇంజనీరింగులో నూతనరీతుల పుట్టుకతో విశిష్టతను పొందిన సాంకేతికాభివృద్ధిలో ఒక నూతన శకం ప్రారంభమయిందని చెప్పవచ్చును.

అణు పదార్థ విజ్ఞానశాస్త్ర సిద్ధాంతం, ప్రయోగం విషయాలలో, కాస్మిక్ ప్రసారం, సెమికండక్టర్ల వినియోగం, ఖగోళశాస్త్రం, గణిత శాస్త్రం, ఘన రసాయనిక శాస్త్రం, జీవ రసాయనిక శాస్త్రం మొదలైన విషయాలలో మా విజ్ఞాన శాస్త్రవేత్తలు ప్రముఖ ఫలితాలను సాధించారు. రసాయనిక శాస్త్రజ్ఞులు, మెకానికల్ ఇంజినీర్లు, లోహ శాస్త్రజ్ఞులు, భూగోళ శాస్త్రజ్ఞులు, భూగర్భ శాస్త్రజ్ఞులు, తదితర నిపుణులు సాధించిన విజయాలు జాతీయార్థిక విధానానికి గొప్ప ప్రాముఖ్యతను కలిగి వున్నాయి.

విజ్ఞాన శాస్త్రంలో సాధింపబడిన విజయాలు, ఉత్పత్తిలో ఎదురయ్యే సమస్యలను త్వరితంగా పరిష్కరించడానికీ, అతి సమర్థవంతంగా పనిచేయగల యంత్రాల నిర్మాణానికీ, అధునాతన సాంకేతిక స్థాయికి సరిపోగల సాంకేతిక పద్ధతులను రూపొందించడానికీ మాత్రమే గాక, జాతీయార్థిక విధానంలో నూతన విషయాలను అత్యంత వేగంతో ప్రవేశపెట్టడానికిగూడా తోడ్పడుతాయి. ప్రస్తుతం విజ్ఞాన శాస్త్రవేత్తల దృష్టి విజ్ఞానశాస్త్రంలోని అత్యంత ముఖ్యమైన రీతులపైన కేంద్రీకృతమై వున్నది.

ప్రస్తుతం ప్రపంచంయొక్క దృష్టి అణుశక్తి వినియోగానికి సంబంధించిన సమస్యలపైన కేంద్రీకరింపబడివున్నది. అణు యుద్ధ ప్రమాదాన్ని అరికట్టి, మానవ మేధస్సు కనుగొన్న ఆ మహత్తర విషయాన్ని ప్రజా శ్రేయస్సుకొరకు ఉపయోగపడేటట్లు చేయడానికి అభ్యుదయకర శాంతి శక్తులు సంఘటితమవుతున్నాయి.

అణు శక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించడం విషయంలో సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు యెంతో ముందడుగు వేశారు. 1954 వేసవి మొదలుకొని 5,000 కిలోవాట్ల కెపాసిటీ గల సోవియట్ దేశ అణు విద్యుత్కేంద్రం, దానికి చుట్టుపట్ల వున్న ప్రాంతాలల్లోని పరిశ్రమలకు, వ్యవసాయానికి అవసరమైన విద్యుచ్ఛక్తిని తయారుచేస్తున్నది. 600,000 కిలోవాట్ల కెపాసిటీ గల అణు విద్యుత్కేంద్రాల నిర్మాణం కొనసాగుతున్నది. రవాణా శాఖలో అణు విద్యుచ్ఛక్తిని వినియోగించడానికి గల అవకాశాలు ఆలోచింపబడుతున్నాయి. మొట్టమొదటి సోవియట్ అణు విద్యుత్ హిమవిచ్ఛేదల నౌక 1958 లో పనిచేయడం ప్రారంభిస్తుంది. తిరిగి ఇంధనాన్ని స్వీకరించడానికి ఏ రేవులోను ఆగనవసరం లేకుండానే ఈ నౌక రెండు-మూడు సంవత్సరాలపాటు ప్రయాణం చేయగలుగుతుంది.

బీజాణువుయొక్క అణుశక్తులను పరిశీలించేందుకు సోవియట్ దేశంలో విస్తృతంగా పరిశోధనలు కొనసాగుతున్నాయి. ఇందు కొరకు కొత్త వైజ్ఞానికసంస్థలు సాంకేతికయూనిట్లు స్థాపింపబడ్డాయి. 10,000 మిలియన్ ఎలక్ట్రాన్-ఓల్టుల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయడానికి ప్రోటాన్లవేగాన్ని త్వరితం చేయను ఒక యూనిట్ స్థాపింపబడింది. 50,000 మిలియన్ ఎలక్ట్రాన్-ఓల్టుల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసేందుకు ప్రోటాన్ల వేగాన్ని త్వరితం చేయడానికి మరొక యూనిట్ కొరకు పథకం సిద్ధపర్చబడింది. బాగా పనిచేయగల అణురియాక్టర్లు, సిస్టంలు యేవో తెలుసుకొనేందుకు, రకరకాల డిజైన అణుయూనిట్లు పారిశ్రామిక యంత్రాగారాలలో ఏర్పాటుచేయబడుతున్నాయి. ఇతర రంగాలలో అణుశక్తిని వినియోగించడానికి గూడా పరిశీలనలు జరుగుతున్నాయి: ఐసోటోపుల విషయంలో యీ పరిశోధనలు ప్రధానంగా కొనసాగుతున్నాయి.

రేడియో ధార్మిక కోబాల్టు, అయోడిన్, భాస్వరము, సోడియంలతోపాటు రేడియో ధార్మిక ఐసోటోపులు వైద్యంలో ఉపయోగింపబడుతున్నాయి. దీనివల్ల గొప్ప ఫలితాలు లభిస్తున్నాయి. న్యూక్లియర్ కిరణప్రసారస్వభావం, వివిధవస్తువులపై వాటి ప్రభావం రసాయనిక ప్రక్రియలను తీవ్రతరం చేయడానికి వాటి ఉపయోగం మొదలైన విషయాలకు సంబంధించిన కొత్త సమాచారం లభ్యమవుతున్నది. వివిధ సాంకేతిక ప్రక్రియల ఆటోమేటిక్ కంట్రోలు, రెగ్యులేషన్ల విషయంలో శక్తివంతమైన నూతన సాధనాలను రూపొందించడానికి గూడా న్యూక్లియర్ కిరణప్రసారం అవసరం. ఈ కిరణ ప్రసారాలు అప్పుడే కొన్ని పనిముట్ల విషయాల్లో ఉపయోగింపబడుతున్నాయి.

పదార్థ విజ్ఞానశాస్త్రంలో అణుశక్తితోపాటు, సెమికండక్టర్ల విషయం గూడా ప్రాముఖ్యతను పొందుతున్నది. సెమికండక్టర్ల పదార్థ విజ్ఞానశాస్త్రంలో పరిశోధనలు బాగా కొనసాగుతున్నాయి. కొద్ది విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని సాధ్యంచేసే సెమికండక్టర్ ధార్మిక-మూలవస్తువులు, ఫోటోసెల్‌లు అప్పుడే ఉపయోగంలోకి తీసుకొనిరాబడ్డాయి. 1,000 ఏంపియర్ల వరకు విద్యుచ్ఛక్తిని రెక్టిఫై చేయగల జెర్మానియం రెక్టిఫైయర్లుగూడా ఉపయోగింపబడ్డాయి.

ఇది అణుశక్తి యుగంగా పిలువబడుతున్నది. నేడు వైజ్ఞానిక ఇంజినీరింగు రంగాలన్నిటిలో రేడియో ఎలక్ట్రానిక్ పద్ధతులు వినియోగింపబడుతున్నాయిగాబట్టి దీనిని రేడియో ఎలక్ట్రానిక్ యుగమని కూడా పిలవవచ్చును. అన్ని విషయాలలో త్వరితవేగాన్ని సాధించడం నేటి సాంకేతిక పద్ధతుల విశిష్టలక్షణమన్నది అందరికీతెలిసిందే. ఉత్పత్తి క్రమాల్లోని త్వరిత వేగాన్ననుసరించి, అన్ని విషయాలు లెక్కించుకోవడం, అన్ని హంశాలను పరిగణించడమూ, సాధ్యమైనంత త్వరితగతిని ప్రతిఒక్కటీ పరిష్కరించడమూ అవసరం. ఈ విషయంలోనే మనకు రేడియో ఎలక్ట్రానులు బాగా తోడ్పడుతాయి. విద్యుదయస్కాంతపు అలలు వెలుగుకుగల వేగంతో ప్రసారం చేయబడుతాయి. రేడియో-లొకేషన్, రేడియో-ఎస్ట్రానమీ, రేడియో-స్పెక్ట్రోస్కోపీ, ఎలక్ట్రానిక్ కంప్యూటింగ్ యంత్రాలు, తదితర ఆధునిక ఇంజినీరింగ్ శాఖలు రేడియో-ఎలక్ట్రానిక్ పద్ధతులపైన ఆధారపడిఉన్నాయి. ఖగోళ శాస్త్రం, భూగణితశాస్త్రం, రోహిత దర్శకశాస్త్రం, సముద్రయానం, వాతావరణశాస్త్రం మొదలైనవాటిలో రేడియో-లొకేషన్ వినియోగంతో యెన్నెన్నో విలువైన సాంకేతి కావకాశాలు యేర్పడుతున్నాయి.

పరిశ్రమలలో అల్ట్రా-సౌండ్ డిఫెక్టోస్కోపులు విస్తృతంగా ఉపయోగింపబడడంవల్ల ఉత్పత్తియొక్క శ్రేష్ఠత పెరగడమే గాకుండా ఉత్పత్తి ఖర్చులు తగ్గడంగూడా జరుగుతున్నది. కొన్ని అంశాలను విచ్ఛిత్తిగావింపవలసి వచ్చే సెలెక్టివ్ కంట్రోలు అవసరాన్ని ఇదిలేకుండా చేయడం చాలా ముఖ్యమైన విషయం. అల్ట్రా సోనిక్ డిఫెక్టోస్కోపుల మూలంగా అనేకసందర్భాలలో ప్రమాదాలను అరికట్టి, లోపాలను కనిపెట్టి వస్తుసామగ్రిని పొదుపుచేయడం సాధ్యమవుతున్నది.

నూనె ఉత్పత్తి పెరుగుదల, ప్రధానంగా డ్రిల్లింగు ఎంత వేగంగా ఎంత లోతునకు జరిగిందన్న విషయాలపైనా, సాధ్యమైనంత ఎక్కువగా నూనెను, గ్యాసును తీయడంపైనా ఆధారపడివుంటుంది. వీటిని దృష్టియందుంచుకొని విజ్ఞానశాస్త్రం, సాధ్యమైనంత ఎక్కువగా నూనెనూ, గ్యాసునూ తోడడానికి అనుకూలమైన వైజ్ఞానిక పద్ధతులను సాధించడానికి పాటుపడాలి. నూనెను తోడడంలో హైడ్రాలిక్ పద్ధతులను ఉపయోగించడం, నూనెగనుల ఫిల్టరింగ్ కెపాసిటీని అధికం చేయడానికి పదార్థ విజ్ఞాన, రసాయనిక పద్ధతులను ప్రయోగించడం, టర్బయిన్ డ్రిల్లింగు పద్ధతుల ఇంకా ఉన్నతస్థాయికి తీసుకురావడం మొదలైన వాటికి ఇది వర్తిస్తుంది.

స్వయంచలినీకరణ పద్ధతులను ప్రవేశపెట్టే సమస్యలను పరిష్కరించడానికి సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్తలు అత్యంతంగా కృషిని సల్పారు. ఆప్టిమల్ క్రమాల సిద్ధాంతము, స్వయం చలన రెగ్యులేషన్, కంట్రోలు పద్ధతులు బాగా అభివృద్ధిలోనికి తీసుకొని రాబడుతున్నాయి. రిలే యాక్షన్‌పై ఆధారపడిన నూతన పద్ధతి డిజైనింగు పరికరాలను ఇంజినీర్లు తయారుచేశారు.

నూనె తవ్వకం, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, లోహపరిశ్రమలు మొదలైనవాటిలో స్వయం చలన పద్ధతులను ప్రవేశపెట్టడంలో మేము బాగా ముందడుగు వేశాము. పెద్ద జల విద్యుత్ కేంద్రాలన్నీ స్వయంచలినీకరణ పద్ధతులపై నడుస్తున్నాయి. 33 స్టేషన్లు, 131 సబ్‌స్టేషన్లు దూరంనుండే కంట్రోలు చేయబడుతున్నాయి. ఉష్ణ విద్యుత్‌కేంద్రాలలో కొన్ని ప్రక్రియలు (జ్వలన, ఇంధనం సరఫరా మొదలైనవి) స్వయంచలినీకర పద్ధతినే జరుగుతున్నాయి.

కచ్చితమైన ఫలితాలనిచ్చే స్వయంచలినీకరణ పద్ధతి కొలత, రెగ్యులేటింగ్ యంత్రాలను తయారుచేయడంలో విజ్ఞాన శాస్త్రం అత్యంతంగా తోడ్పడుతున్నది. సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ఇంజిరింగు పరిశోధనా సంస్థలో రేడియో ధార్మిక ఐసోటోపుల సహాయంతో లోహాలను కోసే పద్ధతులను పరిశోధించిన ఫలితంగా, పనిముట్లయొక్క అరుగుదలలను వేగంగా నిర్ణయించే ఒక పద్ధతి కనిపెట్టబడింది. ఈ పద్ధతితో, కోతలోని అత్యంత అధికవేగాన్ని కొద్ది నిముషాల్లోపల నిర్ణయించడం సాధ్యమవుతుంది. ఇందుకొరకు ఒక మిలిగ్రామ్ లోహం మాత్రమే వినియోగమవుతుంది. పూర్వం దానిని నిర్ణయించడానికే 120–200 గంటలు పట్టేది. అనేక టన్నులకుపైగా లోహం వ్యయమయ్యేది.

విద్యుత్ రంగంలో ఇంజినీరు, సోవియట్ విజ్ఞానవేత్తలు, మొత్తం సోవియట్ దేశానికి ఒకే విద్యుత్ సిస్టమును సృష్టించడానికి ప్రత్యేకశ్రద్ధను వహిస్తున్నారు.

ఒకే విద్యుత్ సిస్టము, శక్తివంతమైన ట్రాన్స్‌మిషన్ లైన్లను నిర్మించడానికీ, అతిదూరప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని పంపడానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడమేగాక, సోవియట్ దేశంలో విద్యుదుత్పత్తి సాధారణాభివృద్ధిపైన (విద్యుత్ యంత్రాగారాల పంపకం మొదలైన విషయాలు), మొత్తంగా జాతీయార్థికాభివృద్ధిపైన గొప్ప ప్రభావాన్ని కలుగజేస్తుంది. ఈ సిస్టమ్ నిర్మాణ విషయంలో అనేక ఇంజినీరింగు, వైజ్ఞానిక సమస్యలు యెదురవుతాయి. ఈ సమస్యలను పరిష్కరించడానికి విజ్ఞానశాస్త్ర పరిషత్తుకు సంబంధించిన ఒక విజ్ఞానశాస్త్రవేత్తల జట్టు, ఈ రంగములో పని చేస్తున్న నిపుణుల సహకారంతో కృషిసల్పుతున్నది.

అధిక పంటలను పండించేందుకు, భూసారాన్ని అధికం చేయడానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడం విషయంలో గూడా సోవియట్ విజ్ఞానశాస్త్రం బాగా ముందడుగు వేసింది. భూసారాన్ని అధికం చేయడం విషయంలో పల్లపు ప్రాంతాలలోని నీటిని తోడివేయడం విషయంలో పరిశోధనలు జరుగుతున్నాయి.

రసాయనిక వస్తువులను వ్యవసాయంలో విస్తృతంగా ఉపయోగించడానికి పద్ధతులను విజ్ఞానశాస్త్రవేత్తలు కనిపెడుతున్నారు. రసాయనిక యెరువులు, క్రిమిసంహారక మందులు వినియోగింపబడుతున్నాయి. విజ్ఞానశాస్త్రవేత్తలు తమ సిద్ధాంత పరిశీలనలను ఆధారంగా చేసుకొని, అనావృష్టి, చలి మొదలైన వాటి నెదుర్కొని మొక్కలు జీవించడానికి పద్ధతులను, మార్గాలను కనిపెడుతున్నారు.

అక్టోబరు విప్లవానంతరపు సంవత్సరాలలో సోవియట్ మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం, అన్ని జీవ, సాంఘికశాస్త్రాలకు పునాదిఅయిన ప్రాచీన మేధాసంపత్తిని పునః పరిశీలన గావించడానికి ప్రాథమిక పద్ధతులను చేకూర్చింది. సోషలిస్టు సమాజ సిద్ధాంతాన్ని ఇంకా విపులీకరించడానికీ, సోవియట్ దేశం, ప్రజాతంత్ర ప్రజాస్వామ్య దేశాలలో సోషలిస్టు నిర్మాణానుభవాలను సూత్రీకరించడానికీ, ఆధునాతన జీవశాస్త్ర విజయాలను తాత్వికదృష్ట్యా సూత్రీకరించడానికీ, భావవాద దృక్పథాలను విమర్శించడానికీ తత్వశాస్త్రజ్ఞులు యెంతగానో కృషిసల్పారు.

సోవియట్ అర్థ శాస్త్రవేత్తలు, అర్థ శాస్త్రంలో పూర్వం తెలియని ఒక నూతన శాఖను, జాతీయార్థిక ప్లానింగును రూపొందించారు. ఈ ప్లానింగు విధానము, దానికి సంబంధించిన సైద్ధాంతిక సూత్రాలు ప్రపంచంలోని అన్ని దేశాల అర్థ శాస్త్రవేత్తల చేత అధ్యయనం చేయబడుతున్నాయి. ప్రజాతంత్ర ప్రజాస్వామ్య దేశాలలో సోషలిజం నిర్మాణ విషయంలో ఈ సూత్రాలు విస్తృతంగా అనువర్తింపబడుతున్నాయి. సోషలిజం యొక్క రాజకీయార్థిక సమస్యలను గురించి అనేకమంది అర్థ శాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుతున్నారు. పెట్టుబడిదారి ఆర్థిక విధానంలోని కొత్త పరిణామాలను.

(మిగత 64వ పుట చూడండి)

# ఇవనోవో కార్మిక

జయారాయ్



నేత పారిశ్రామికురాలు

ఈ వేసంగిలో కొందరు రష్యన్ మిత్రులతోపాటు నేను ఇవనోవో నగరానికి వెళ్ళాను. బ్రిటన్‌లో మాంచస్టర్, భారతదేశంలో బొంబాయి వలెనే యీ నగరం సోవియట్ దేశంలో జవుళి పరిశ్రమకు ప్రఖ్యాతి గాంచినది.

నా బంధువులలో చాలా మంది జవుళి మిల్లులలో పనిచేస్తున్నారు. నా భర్త కూడా ఒకప్పుడు జవుళి మిల్లులో పనిచేశారు. అందువల్ల జవుళి కార్మికుల జీవితం యెలాగుంటుందో, వారు ఎలాంటి పరిస్థితుల్లో పనిచేస్తూ వుంటారో నాకు బాగా తెలుసు. బొంబాయి జవుళి మిల్లులను, వాటిల్లో పనిచేసే కార్మికులను గూడా నేను చూచాను. అందువల్లనే సోవియట్ దేశంలోని జవుళి మిల్లులను చూడాలని నాకు యెంతో కుతూహలం కలిగించి.





పార్కులో

ఛాయాచిత్రకారుడు : ఒజెరెస్కీ

# స్త్రీలతో 6 రోజులు



టి. షువన్దినా, పూర్వం బట్టల మిల్లు కార్మికురాలు, జయా రాయ్‌కి తమ పట్టణ చరిత్రను చెబుతోన్న దృశ్యం

ఇవనోవోలో ఉన్న ఆరురోజుల్లో నేను చాలా విషయాలను చూచాను. జవుళి మిల్లులను, మిల్లు కార్మికుల ఇండ్లను, వారి బాలల సంస్థలను, క్లబ్బులను, నాటకశాలలను, విశ్రాంతి గృహాలను.... యెన్నెన్నిటినో చూచాను.

అనస్తాసియా షువాందినా అనే ఒక జవుళి కార్మికురాలితో నాకు పరిచయం యేర్పడింది. ఆమె వయస్సు 60 సంవత్సరాలు. అనస్తాసియా షువాందినా జీవితగాథను, జారు పరిపాలనలోని, సోవియట్ పరిపాలనలోని కార్మిక స్త్రీల జీవితగాథగా పేర్కొన వచ్చును.

ఆమె బాల్యంలోను, యౌవనదశలోను జీవితం గడుపుకోటానికి యెంతో కష్టపడి పనిచేయవలసివచ్చేదట. ఇతర రష్యన్ జవుళి కార్మికులందరివలెనే, 1917 విప్లవం తర్వాత మాత్రమే ఆమెకు చదువుకొని, నైపుణ్యాన్ని సంపాదించుకోడానికి అవకాశం కలిగింది. ఒకే పర్యాయం నాలుగైదు మగ్గాలకు బదులు ఇరవై మగ్గాలపైన పనిచేసి, పారిశ్రామిక ఉత్పాదక శక్తి విషయంలో రికార్డును స్థాపించిన మొట్టమొదటి స్త్రీ షువాందినాయే. ఆమె పని చేసే పద్ధతి దేశమంతటా జవుళి కార్మికులకు ఆదర్శమయింది. ఆమెను చూడడానికీ, ఆమె పనిచేసే పద్ధతులను గురించి తెలుసుకోడానికీ దేశం అన్నిప్రాంతాలనుండి స్త్రీలు వచ్చేవారు. త్వరలోనే ఆమె ప్రఖ్యాతి అంతటా వ్యాపించింది. మునిసిపల్ పరిపాలక సంస్థకు యెన్నుకొనబడింది. తర్వాత ప్రభుత్వాధికారానికి సంబంధించిన అత్యున్నత సంస్థ, సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్‌కు యెన్నుకొనబడింది. 1939లో అత్యున్నతము, అత్యంత గౌరవకరము అయిన ఆర్డర్ ఆఫ్ లెనిన్ బహుమానాన్ని పొందింది.

అనాస్తియా షువాందినా జీవితంమట్టుకే యిలాంటిదనడానికి వీల్లేదు. ఇవనోవోలో ఇలాంటి స్త్రీలు వందలకొలదిగా వున్నారు.



ఇవనోవో పట్టణంలోని, 'స్టాలిన్ ఎవెన్యూ' దృశ్యం





నాటకశాలకు మిల్లు కార్మికులు వస్తారు

వివిధ మిల్లులను సందర్శించినప్పుడు నేను ఇలాంటి స్త్రీల నెంత మందినో కలుసుకొని మాట్లాడాను. మామూలు కార్మికులుగా మిల్లులలో ప్రవేశించిన వీరు, పనిచేస్తూనే ప్రత్యేక సాయంత్రపు పాఠశాలల్లోను, కళాశాలల్లోను చేరి చదువును పూర్తిచేసుకొన్నారు. వారా విధంగా మామూలు కార్మికులస్థాయినుండి, ప్రవీణులై క్రమంగా యంత్రాగారాలలోని షాపులకు అధిపత్యం వహింపసాగారు. వారిలో అనేకమంది కార్మిక సంఘాల్లోని ఉన్నత స్థానాలకు ఎన్నుకొనబడ్డారు. రాజకీయ నాయకత్వాన్ని స్వీకరించారు. చివరికి మిల్లుల డైరెక్టర్లు గూడా అయ్యారు.

నేను కలసి, మాట్లాడడానికి అవకాశం లభించిన వారంతా ఇంకా నాకు బాగా జ్ఞాపకం ఉన్నారు. ఉదాహరణకు, వీరా మిఖైలో సంగతి తీసుకోండి. ఎవరితోనైనా మాట్లాడడమంటేనే ఆమెకు సిగ్గు. ఆమె రైతు కుటుంబానికి చెందినది. డ్జెర్జిన్స్కీ మిల్లులోవా ఉన్నప్పుడు ఆమె చదువుకొని మగ్గాలునడిపే పనిలోకి వచ్చింది. ఇప్పుడామె కార్మిక సంఘంలో చురుకుగా పనిచేస్తున్నది. స్థానిక పరిపాలనా సంస్థ అయిన జిల్లా సోవియట్ ప్రతినిధిగా యెన్నుకొనబడింది.

వాలెంతీనా వాసిల్యేవ్నా అనే అసిస్టెంటు ఫోర్‌వుమన్ విషయం తీసుకొందాము. ఆమె గూడా రైతు కుటుంబంనుండి వచ్చినదే. వీరా మిఖైలోవా వలెనే ఆమె మిల్లులో పనిచేస్తూనే చదువుకొని, ప్రావీణ్యతను సంపాదించింది. సాంఘిక సేవా కార్యక్రమంలోగూడా ఆమె చురుకుగా పాల్గొంటుంది.

"క్రాస్నయా తాల్కా" నేత మిల్లుకు నేను వెళ్ళినప్పుడు, స్థానిక కార్మిక సంఘం అధ్యక్షురాలు యెలెనా నికొలయేవ్నాతో మూడు గంటలసేపు గడిపాను. స్త్రీ కార్మికులు ఆమెను "మా అమ్మ" అని అంటుంటారు. ఆమె నిజంగా అగౌరవానికి తగినదే. వాళ్ళంతా వెళ్ళి తమ కష్టసుఖాలను ఆమెతో చెప్పుకుంటుంటారు: ఒకరు చదువుకోవాలని, మరొకరు ఇల్లు కట్టుకోవాలని, ఇంకొకరు తన బిడ్డను వేసవి సెలవుల్లో బాలసంఘం శిబిరానికి పంపాలని—ఇలా వచ్చి తమ పనులను చెప్పి సలహాల నడుగుతుంటారు. జవుళి మిల్లులలో స్తాకనోవైట్ ఉద్యమాన్నినిర్మించిన మొట్టమొదటి స్త్రీలలో యెలెనా నికొల్యేవ్నా ఒకామె. ఆమె సేవలను గుర్తించి సోవియట్ ప్రభుత్వం ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బ్యానర్ బిరుదుని ఇచ్చింది. ఇతర స్త్రీలవలెనే ఆమె మామూలు నేత కార్మికురాలుగా పనిని ప్రారంభించింది. తర్వాత ఆమె ప్రత్యేక కళాశాలలో చదువుకొని జవుళి ఇంజినీరయింది.

"క్రాస్నయా తాల్కా" కర్మాగారానికి చెందిన వడకు విభాగ దృశ్యం



షుయిస్కీ జవుళి మిల్లు డైరెక్టరు మరియా మొలొస్నోవా అంటె ఆ మిల్లుకు పంచప్రాణాలు. మామూలు కార్మికురాలుగా జీవితం ప్రారంభించిన ఆమె డైరెక్టర్ స్థానానికి వచ్చింది. ఆమె ఆ మిల్లు డైరెక్టరయి అప్పుడే ఇరవై సంవత్సరాలయింది.



తరతరాల నుంచీ నేతవృత్తిలోవున్న లెబెదేవ్ కుటుంబం

నేను స్త్రీలను గురించి మాత్రమే ఎందుకు వ్రాస్తున్నానా అని పాఠకులు ఆశ్చర్యపడవచ్చు. కాని నేను గూడా స్త్రీనేగదా. అందువల్ల నాకు స్త్రీల జీవిత పరిస్థితులను గురించి ఆసక్తి గలగడం సహజమే. ఆ విషయం అలా ఉండగా, ఇవనోవోలోని జవుళి మిల్లులలో పనిచేస్తున్నవారిలో నూటికి 70—80 మంది స్త్రీలే.

జవుళి పరిశ్రమలోని కార్మికులను ఇదివరకు నేనెంతమందినో చూచాను. కొబట్టి నా ఊహాచిత్రంలో ఈ వృత్తిలోనివారు బక్కచిక్కి, గుడ్డలైనా సరిగ్గాలేక, అకాల వృద్ధాప్యం సంప్రాప్తించినవారుగా ఉంటుండేవారు. అంతకుమించి నా మనస్సు వేరుగా ఊహించలేకపోయేది. కాని నేను ఇవనోవోలో చూచిన కార్మిక స్త్రీల పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉన్నది. ఇవనోవో జవుళి కార్మిక స్త్రీలు ఇతర స్త్రీలందరిలాగనే చక్కని దుస్తులను ధరించి, ఆరోగ్యవంతంగా వున్నారు.

ఒక స్త్రీల గుంపులో ఎంత ప్రయత్నించినా నేను అందులో కార్మిక స్త్రీలెవరో తెలుసుకొనలేకపోయిన సంఘటన ఒకటున్నది. ఒక నృత్యనాటికను చూడడానికి మేము నగరంలోని ఒక నాటకశాలకు వెళ్ళాము. అక్కడికి వచ్చినవారిలో జవుళి కార్మిక స్త్రీలను కొందర్ని ఫోటో తీద్దామని ప్రయత్నించాము. కాని వారిలో ఎవరు కార్మిక స్త్రీలో కనుగొనలేకపోయాము. నేను అలా తికమకలు పడుతూ ఉండడంచూచి కొందరు స్త్రీలు నాదగ్గరకు వచ్చి, నాకు యేదైనా సహాయం అవసరమైతే చేసిపెడతామన్నారు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని నేను యేమి కావాలో చెప్పాను. మను

డ్జెంజిన్‌స్కీ ఫాక్టరీకి చెందిన ఒక బట్టల మిల్లు కార్మికురాలి వద్దకు వెళ్ళిన జయా రామ్





ఐవనోవ్ నేత కుటుంబపు కొత్తదనం

పిల్లల పోషణ విషయం పనిచేసేవారైన స్త్రీలకు చిక్కుసమస్య. భారతీయ స్త్రీలమైన మాకు ఆ విషయం బాగా తెలుసు. కాని బాల పోషణకు సహాయపడే అనేక బాలసంస్థలను, శిశుపోషణాలయాలను బాలోద్యానవనాలను స్థాపించిన ప్రభుత్వం యీ సమస్యను సమర్థవంతంగా పరిష్కరిస్తున్నది.

ఇవానొవోలోని శిశుపోషణాలయాలు, బాలోద్యానవనాలు 14,000 మంది బాలల పరిపోషణ బాధ్యతను వహిస్తున్నాయి. పనుల లోకి పోయేముందు తల్లులు తమ పిల్లలను యీ శిశుపోషణాలయాలకు, బాలోద్యానవనాలకూ తెచ్చి వదులుతారు. వారం పొడుగునా రాత్రింబగళ్ళు బాలలను ఉంచుకొని పరిపోషణ బాధ్యతను వహించే బాలోద్యానవనాలు కొన్నున్నాయి. తల్లిదండ్రులు శనివారం సాయంత్రంమాత్రం తీసుకువెళ్ళి ఆదివారమంతా తమదగ్గర వుంచుకొంటారు. కాని తలిదండ్రులు ప్రతిరోజు సాయంత్రం తమ బిడ్డలను యింటికి తీసుకుపోవాలని ఆశిస్తుంటారు గాబట్టి ఇలాంటి బాలోద్యానవనాలు యెక్కువగా లేవు. కాని శిశుపోషణాలయాలను, బాలోద్యానవనాలను మేము యెక్కువగా చూడలేకపోయాము. ఎందువల్లనంటే, అది వేసవికాలం అవడంచేత గ్రామీణ ప్రాంతాల్లోకి, నదీ తీరాలకు మార్చబడ్డాయి. బాలలు వేసవికాలమంతా బహిరంగ స్థలాల్లోనే గడుపుతూ

క్షణంలో ఒక స్త్రీల గుంపు నాచుట్టూ చేరింది. ఈ ఫోటోలోనివారు ఆ స్త్రీలే. ఒక వారంరోజులపాటు వారు పనిలోను, ఇండ్లల్లోను, నాటకశాలలు, సినిమా హాళ్ళలోను, పార్కులలోను ఉండగా చూచిన నాకు వారు యెంతో ఆనందంగా జీవితం గడుపుతున్నారని తెలిసింది.

ఇవనోవో జవుళి కార్మికులు ఇప్పుడు పూర్వంలాగ బ్యారెక్‌లలోను, గుడిసెలలోను ఉండటంలేదు. చక్కగా నిర్మింపబడిన ఆధునిక గృహాల్లో ఉంటున్నారు. చాలా మందికి స్వంతఇండ్లేఉన్నాయి. కాని అధికసంఖ్యాకులు తమ మిల్లులు కట్టించిన ఇండ్లల్లోనే నివసిస్తున్నారు. వివిధ రకాలకు చెందిన కార్మికుల ఇండ్లను నేను సందర్శించాను. ఆ ఇండ్లన్నీ విశాలంగా, సౌకర్యవంతంగా, పరిశుభ్రంగా వున్నాయి. ఒకటి, రెండు, మూడు గదులుగల అపార్టుమెంటులు వున్నాయి. చలికాలంలో గదులను వేడిగా ఉంచడానికి సెంట్రల్ హీటింగ్ సిస్టమ్ ఉన్నది. నేను చూచిన చాలా ఇండ్లల్లో గ్యాస్ యేర్పాటుకూడా ఉన్నది. ఇతర ఇండ్లలో ఇప్పుడాయేర్పాట్లు జరుగుతున్నాయి. ఈ సౌకర్యాలన్నీ గృహిణుల పనులను తేలిక చేస్తున్నాయి.



మిల్లు కార్మికురాలు స్మిర్నోవా. పరీక్షలకు సన్నద్ధమవుతున్న విద్యార్థిని ఆమె కుమార్తె

వుంటారు. డ్జెర్జిన్స్కీ మిల్లు బాలోద్యానవనాన్ని మాత్రమే మేము చూడ గలిగాము.

మేము బాలోద్యానవనానికి వెళ్ళేటప్పటికి బాలలు అప్పుడే ఉదయపు ఫలహారం చేయడం పూర్తయింది. నింపాదిగా తింటున్న ఒక్క బాలికమాత్రం ఇంకా భోజనాలశాలలో వున్నది. గులాబి పువ్వుల బొమ్మలు కట్టిన తెల్లనిబట్ట పరిచివున్న చిన్న టేబులు ముందు ఒక చిన్న కుర్చీలో కూర్చొని వున్నది. ఇతర బాలలు ఆటల గదిలో తమకు యిష్టం వచ్చిన బొమ్మలతో ఆడుకొంటున్నారు. కొందరు ఆనందంగా బైసికిళ్ళపై తిరుగుతున్నారు. మేము కోరగా అందరిలోకి చిన్న వయస్సుగల ఒక బాలిక కొన్ని బాలల గేయాలను చదివింది. ఆ గేయాలు చదువుతున్నంత సేపు నిజంగా పుస్తకం చదువుతున్నట్లే ఒక పుస్తకం పుటలు తిరుగవేయ సాగింది. అరమర్మి కలు తెలియని వయస్సు!

అలాంటి బాలోద్యానవనాలు, శిశుపోషణాలయాలు కార్మిక



మరియా అలెగ్జాండ్రోవ్నా వినొగ్రదోవా, పూర్వపు మిల్లు పనికత్తె, ఇప్పుడు పింఛను పుచ్చుకొంటున్నది



స్త్రీలకు మహదానందాన్ని కలుగజేస్తాయని నా గట్టి నమ్మకం.

పాఠశాలకు పోయే యీడు బాలలకు బాల సంఘం క్లబ్బులు, బాల సంఘంభవనాలువున్నాయి. పాఠశాలలనుంచి వచ్చిన తర్వాత బాలలు ఇక్కడికి వచ్చి తమకు ఆసక్తిగల పనులలో నిమగ్నులవుతారు. ఇవనోవో బాల సంఘ భవనానికి వెళ్ళి నప్పుడు నాట్యదళం

నాలు తీత కర్మాగారపు బాలోద్యాన పాఠశాలలో

ఒకటి రిహార్సల్స్ చేస్తున్నది. రష్యన్ జాతీయ దుస్తులను ధరించి ఉన్న బాలికలు జానపద నృత్యాలను చేస్తున్నారు. మరొక గదిలో బాలురు ఒక వడ్రంగం బేబులుదగ్గర నిలబడి రంపంతో వింతవింత ఆకారాల్లో కొయ్యముక్కలను కోస్తున్నారు. కాని యిక్కడగూడా మేము యెక్కువ విషయాలను చూడలేకపోయాము. ఎందువల్లనంటే వేసవి కావడంచేత పిల్లల్లో అధికభాగం నగరానికి దూరాన వున్న బాలసంఘం శిబిరాలలో గడుపుతున్నారు.

షుయిస్కి మిల్లుకు వెళుతున్నప్పుడు మార్గమధ్యంలో మేము ఒక బాలసంఘం శిబిరాన్ని చూచాము. నదీ తీరానికి సమీపంలోనే ఒక అందమైన అడవిలో అది యేర్పాటుచేయబడి వున్నది. గాజు ఆవరణతో వున్న వరండాలుగల కుటీరాలతో కూడివున్నదా శిబిరం. ఈ శిబిరం ఆటల మైదానంలో ఊయలలూ, రంకుల రాట్నాలు, వాలీ బాల్ కోర్టు, ఒక ఫుట్‌బాల్ ఫీల్డు వున్నాయి. చక్కని ఆహారం బాలలకు ఇవ్వబడుతుంది. అంతా యెంతో ఆరోగ్యంగా వున్నారు.

ఈ శిబిరంనుండి తిరిగివస్తూ, మేము స్త్రీ కార్మికులు తమ పాపలతోపాటు విశ్రాంతితీసుకొనే ఒక విశ్రాంతిగృహాన్ని చూచాము.

మిల్లులలో పనిచేస్తున్న స్త్రీలు పొందుతున్న సౌకర్యాలను గురించి కొంత చెబుతాను. ఉదాహరణకు, ప్రసూతికి ముందు రెండు నెలలు, తర్వాత రెండు నెలలు. మొత్తం నాలుగు నెలలు సెలవు యివ్వడం అలాంటి సౌకర్యాలలో ఒకటి. మిల్లులలో "సానిటరీ రూమ్స్" అనే ప్రత్యేకస్థలాలు వున్నాయి. స్త్రీ కార్మికులు విశ్రాంతి తీసుకోడానికీ, ఆరోగ్యావసరాలను చూచుకోడానికీ యివి ఉపయోగపడుతుంటాయి. పిల్లలకు చనుబాలనిచ్చే దశలో, తల్లులు యెనిమిది గంటలకు బదులు ఏడు గంటలే పనిచేస్తారు. అటు తర్వాత పిల్లలకు పాలనివ్వడానికి వెళ్ళిపోతారు. కార్మిక స్త్రీలకు ప్రతి సంవత్సరం జీతంతో సెలవు ఇవ్వబడుతుంది. ఆ సెలవును వారు విశ్రాంతి గృహాల్లోను, వైద్యచికిత్స అవసరమైనట్లయితే ఆరోగ్య కేంద్రాలలోను గడుపుతుంటారు.

కార్మిక స్త్రీలకు, తదితర కార్మికులందరికివలెనే ఉచితవైద్య సహాయం లభిస్తుంది. నగరంలోని ఒక పోలీ క్లినిక్‌తోపాటు, ప్రతి మిల్లుకు ప్రత్యేకంగా వైద్య కేంద్రాలు, పోలీ క్లినిక్‌లు వున్నాయి. నేను చూచిన డ్జెర్జిన్స్కి మిల్లు పోలీక్లినిక్ మిల్లు మైదానంలో వున్నది. దానికి ఔషధచికిత్సా విభాగం, శస్త్రచికిత్సా విభాగం, ఎక్స్‌రే విభాగం, దంతవైద్య విభాగం వున్నాయి. పోలీ క్లినిక్‌ల డాక్టరు రోగులకు వైద్య చికిత్స చేయడమేగాక, మిల్లు కార్మికులు యెలాంటి పరిస్థితుల్లో జీవిస్తున్నారో తెలుసుకొనేందుకు కార్మికుల ఇండ్లనుగూడా సందర్శిస్తుంటారు. మిల్లులకు వెళ్ళి అక్కడి ఆరోగ్య పరిస్థితులను పరిశీలిస్తుంటారు. సంవత్సరానికి ఒకటి, రెండు పర్యాయాలు కార్మికులకందరికీ వైద్య పరీక్ష జరుపుతారు.

మిల్లులలో స్త్రీల పనిని సులభతరం చేయడానికి అనేక చర్యలు తీసుకొనబడుతున్నాయి. ఉత్పత్తిని యంత్రీకరణ చేయడంపట్ల ప్రధానంగా శ్రద్ధ వహింపబడుతున్నది. యంత్రాగారాలలోకి చక్కని వెలుతురు వచ్చే యేర్పాట్లు వున్నాయి. సహజమైన వెలుగు సరిపోయినంతగా లేని ప్రదేశాలలో పగటి వెలుగులాగ వుండే విద్యుద్దీపాలు యేర్పాటు చేయబడ్డాయి. శక్తివంతమైన వెంటిలేటర్ల ద్వారా మిల్లుల్లోకి స్వచ్ఛమైన గాలి వచ్చేట్లు చూడబడుతుంది.

మిల్లులలోని పరిశుభ్రతను చూడగా నాకు ఆశ్చర్యం వేసింది. గాలిలో పత్తి ఎగురుతూ కనబడనే కనబడదు. పత్తి గాలిలోకి రేవకుండా మగ్గాలలోనే ప్రత్యేకమైన యేర్పాట్లున్నాయి. మగ్గాలు తరచుగా పరిశుభ్రపరచబడుతూ వుంటాయి. అన్ని మిల్లులలోను సోడా వాటర్, మంచినీళ్ళు లభిస్తాయి. ముఖ్యంగా శీతాకాలంలో జలుబు చెయ్యకుండా వుండేట్లు శీతోష్ణస్థితిలో మంచినీళ్ళు వుంచబడుతాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే అక్కడి పని పరిస్థితులు ఈర్ష్య పడదగినవిగా వున్నాయి. ఈ మిల్లులలో పనిచేసేవారు అలసటను పొందరు. కార్మిక స్త్రీలు పనిలోంచి ఇంటికి తిరిగిపోతుండగా వారిని నేను చూడడం తటస్థించింది. గుంపులు గుంపులుగా మిల్లులోంచి గేటు దగ్గరికి వస్తున్న ఆ కార్మిక స్త్రీలు యెంతో ఉత్సాహంగా వున్నారు. సంతోషంగా ఒకరితో నొకరు మాట్లాడుకొంటున్నారు. వారిలో అలసట యేమాత్రమూ అగుపడలేదు. వందలాదిగా ఈ కార్మిక స్త్రీలు తమ భర్తలతోపాటు సాయంత్ర పూట సినిమాలకు, నాటకాలకు, పార్కులకు వెళుతుంటారంటే అందులో ఆశ్చర్యపడవలసినదేమీ వుండదు. యువజనులలో అనేకులు, వయస్సుమళ్ళిన వారిలో కొందరుగూడా మిల్లుల్లో పనులు చేసుకొంటూనే విరామ సమయాల్లో చదువుకొంటుంటారు. ఇవనోవో జవుళి కార్మికులు. విద్యాభ్యాసంలో ఆసక్తి చూపడం సర్వసాధారణమైన విషయం. యువజనులలో అనేకులు యువజన కార్మికులకొరకు యేర్పాటుచేసిన పాఠశాలల్లోను, సెకెండరీ ప్రత్యేక పాఠశాలల్లోను, సాంకేతిక పాఠశాలల్లోను మాత్రమేగాక కళాశాలల్లోగూడా చేరి చదువుకొంటుంటారు. డ్జెర్జిన్స్కి మిల్లులో జవుళి విద్యాసంస్థ శాఖ ఒకటి వున్నది. నన్ను ఆహ్వానించిన విద్యాశాఖవారు, ఇవనోవో జనాభాలో నూటికి 24 మంది, యువజన కార్మికులకొరకు ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన సెకెండరీ పాఠశాలల్లోను, సాంకేతిక విద్యాసంస్థల్లోను చదువుకొంటున్నారని తెలియజేశారు.

నిరాడంబరుల ప్రేమాస్పదులు అయిన ఇవనోవోలో జవుళి కార్మికుల మధ్య గడిపిన ఆ ఆరు రోజులను నేనెన్నటికీ మరువలేను.

---

## అక్టోబరు విప్లవం, ప్రముఖ భారతీయుల అభిప్రాయాలు

(7వ పుట తరువాయి)

కొందరు చెప్పితే, వారి నీడలనుకూడా అంటుకోకూడదని మనం చెప్పవలసిన అవసరమేమి వచ్చింది? వారు పొరపడవచ్చును—వారి ప్రతికక్షులు పొరపడరని కాదు. అయినా, యీ క్షణాన్నే బలహీనుల బలాన్ని జ్వలింపచేయకపోయినట్లయితే మానవజాతికి భవితవ్యం లేదని మనం చెప్పవలసిన కాలం ఆసన్నమైంది. ఎందువల్లనంటే బలవంతులు మరీ బలవంతులయిపోయారు; భూమి యింతకాలమూ విపరీతమైన తాప భారంతో వుంది—నేడు ఆకాశానికికూడా వాళ్ళ పాపాలను పులిమివేశారు."

రష్యా గురించి లేఖలు,
బెంగాలీ మూలప్రతి, పుటలు 16-17.



క్రాస్నయా ప్రెస్నయా 1917 లో

(43వ పుట తరువాయి)

విలేఖరి యం. ఒజెర్‌స్కీ నలభై ఏళ్ళక్రితం తీసినది, యీ చిత్రం. రాతివీధులు, చిన్న పేదయిళ్ళు. అరుదుగా పోయే మనుష్యులూ, గుర్రపుబళ్ళూ — యీ విధంగా వుండేది 1917లో మాస్కో.

నలభై ఏళ్ళు గడిచిపోయాయి. ఒజెర్‌స్కీ అదే వీధిని, అదే స్థలంనుండి ఫోటో తీశారు (దిగువ ఛాయాచిత్రం) ఇప్పుడు విశాలమయిన అవెన్యూలూ, అనేక అంతస్తులుగల యిళ్ళు, కార్లు మీకు కనిపిస్తాయి. ఇది 1957లో మాస్కో.

మనకాలపు క్రాస్నయా ప్రెస్నయా మండలంలో

మొదటిఅట్ట: "అక్టోబరు 1917. పెత్రోగ్రాద్"
చిత్రకారుడు:, ఎకడమీషియన్ దెనెకా

రెండవఅట్ట: భూతలికి ఇప్పుడు ఎంత చక్కటి బాలచంద్రు డొచ్చాడు!

మూడవఅట్ట: అక్టోబరు సామ్యవాద విప్లవానికి అంకితమైన చిత్ర సంపుటిలోని ఒకచిత్రం.
ఒక కార్మికుడు "సర్వాధికారం సోవియట్లకే!"అన్న నినాదం వున్న ఒక పోస్టరును గోడకు అంటి స్తున్నాడు.
రచన: ఎన్. దొల్‌గొరుకోవ్

## నలభై సంవత్సరాల విజ్ఞాన ప్రగతి

(56వ పుట తరువాయి)

సామ్రాజ్యవాద విధానాలను విశ్లేషించి, సూత్రీకరించడం విషయంలో గూడా ముఖ్యమైన ఫలితాలు సాధింపబడ్డాయి. ఎకడమీషియన్ వై. ఎస్. వార్గా, ఎకడమీషియన్ ఎస్. జి. స్త్రుమిలిన్, తదితర సోవియట్ అర్థ శాస్త్రవేత్తల రచనలు ప్రఖ్యాతి గాంచాయి.

సోవియట్ చరిత్రకారులు, సాహిత్యం, కళల చరిత్రకారులు గూడా గొప్ప విజయాలను సాధించారు. రష్యన్ సాహిత్య చరిత్ర ఒకటీ, రష్యన్ కళల చరిత్ర ఒకటీ తయారు చేయబడ్డాయి. ప్రాచ్య విద్యాధ్యయన వేత్తలు, స్లావొనిక్ పండితులు, నరజాతి వర్గీకరణ శాస్త్రజ్ఞులు, పురావస్తు శాస్త్రజ్ఞులు, భాషా శాస్త్రజ్ఞులు, బహు భాషా పండితులు సోవియట్ సాంఘిక విజ్ఞానశాస్త్రాల అభివృద్ధికి అత్యంతంగా దోహదం చేశారు. సోవియట్ దేశంలోని అనేకజాతుల ప్రజల భాషలకు వర్ణక్రమాన్ని తయారుజేసి సోవియట్ భాషా శాస్త్రజ్ఞులు గొప్ప సేవను చేశారు. నేడు సోవియట్ దేశంలోని వివిధ ప్రజలయొక్క 60 భాషలలో వార్తాపత్రికలు ప్రకటింపబడుతున్నాయి 1917 అక్టోబరు విప్లవానికి పూర్వం ఈ భాషల్లో అనేకం వ్రాయబడేవే కాదు.

గత నలభై సంవత్సరాల కాలంలో సోవియట్ దేశంలో విజ్ఞాన శాస్త్రం ఒక మహత్తర శక్తిగా అభివృద్ధి పొందింది. సమిష్టి కృషి, విస్తృతమైన వైజ్ఞానిక పరిశోధనలు, ఉత్పత్తితో, జీవితంతో సన్నిహిత సంబంధం—ఇవే దీనియొక్క విశిష్ట లక్షణాలు.

## విప్లవం నిర్మూలించినది

నిరుద్యోగం, ఆకలి, దరిద్రం, దేశదిమ్మరితనం, వ్యభిచారం, బాలల, స్త్రీల వెన్నువిరిగే చాకిరి—అమానుషమైన వాటిలో కొన్నింటిని, రష్యాలో అక్టోబర్ విప్లవం, నలభై సంవత్సరాల క్రిందట నిర్మూలించినది. యువతరం వాటిని గురించి వినికిడివల్ల, మేము రష్యన్ ప్రభుత్వ పత్ర సంచయంనుండి వెలికితీసిన, రాబోవు సంచికలో ప్రకటింపబడనున్న ఛాయాచిత్రాలవల్ల తెలుసుకుంటుంది.

ఇంకా రానున్న సంచికలో:

* జె. సి. బోస్ గురించి రష్యన్ శాస్త్రజ్ఞులు
* రష్యాలోని ఆర్థొడాక్స్ చర్చి
* దుంప (పిల్లల కథ) మొదలైన శీర్షికలు

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీనుండి. సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు: పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ-6.

Власть Совѣтамъ!
Земля Крестьянамъ!
Миръ Народамъ!



